

శ్రీ

# ప్రసన్నయాదవనాటకము.

## ప్రథమాంకము.

### నాంది.

మ. మును లోకస్థానక వీంద్రుఁ; డాగమచయంబు ల్వందిబృందంబు; స
జ్జనచిత్తంబులు కేళ్యకూటములు; సంద్రంబు ల్ధనాగారము
ల్మనుజుల్ సేసెడిసేవ యప్పనము; బ్రహ్మాండంబు సామ్రాజ్య మె
వ్వని కా యాదవచక్రవర్తి కృపఁ గాపాడు న్సభాస్తారులన్. 1

యు

తే. గీ. ప్రాణికోటుల నెల్లఁ బాత్రములఁ జేసి
జగ మనెడు మహారంగ దేశంబునందు
నాటకంబుల నేర్పుతో నడపునట్టి
సూత్రధారుండు మిముఁ బ్రోచు శుభము లొసఁగి. 2

సూత్రధారుఁడు—(నాంద్యనంతరమున తెరవంకఁ జూచి) పారిపార్శ్వకా! నీ
సారి యిటు రాఁగలవా?

పారిపార్శ్వకుఁడు—(ప్రవేశించి) అయ్యా! ఇదిగో వచ్చియున్నాఁడను. నే
చేయవలసియున్నది?

సూత్ర—ఓయీ! సాయంకాలమునుండి ప్రయత్నము చేయుచున్నను నీ విప్ప
రంగకృత్యమును సిద్ధముచేయలేక పోతివా?

పారి—అయ్యా! మీరు నిష్కారణముగా నాపై నేరమును మోపుచున్నారు.
యు నీవఱకే సిద్ధమయి యున్నయది. సభాసదులతో మనము ప్రయోగింపఁబోవు
పకమును గూర్చి మీరు చెప్పవలసినది చెప్పకపోవుటయే యాలస్యము.

సూత్ర—ఏమీ! నాదే యాలస్యమా? అట్లయిన నిదిగో చెప్పుచున్నాఁడను.
శిఖామణు లగు నో సభాసదులారా! విద్వజ్జనవిధేయుఁ డగు బ్రహ్మశ్రీ చిలకమర్తి

లక్ష్మీనగసింహకవిచేత నాంధ్రభాషలో రచియింపఁబడిన ప్రసన్నయాదవ మనువీర ప్రధానరూపకమును; మే మీరాత్రి యిచ్చటఁ బ్రయోగింపఁ దలఁచుకొన్నారము. కావున మీరు సావధానులరయి చిత్తగింతురు గాక!

పారి—అయ్యా! ఈనాటకగుణాగుణంబులఁ గూర్చి యించుకేనియుఁ జెప్పితివేమి?

సూత్ర—దానింగూర్చి చెప్పఁదగినవాఁడను నేను గాను.

మ. కవి పౌన్నారు; కృతుల్నగ, ల్కథయె బంగారంబు, శ్లేషాది స
త్కవనంబు ల్నగిషీపను, ల్లసదలంకారంబు లుద్యన్మణీ
నివహంబు; ల్కృతిమేల్మి యెట్టిదియొ, త న్నిర్మాత నే ర్పెట్టిదో
వివరింపందగు నాణెకాండ్రు గద! యుర్విన్ బండితగ్రామణుల్.

పారి—ప్రబంధ మె ట్లున్నను బ్రయోగకుశలుల మగుమనము సభాసదుల తోషింపఁ జేయఁగలమని నేఁ దలంచెద.

సూత్ర—ఓపండితంమన్యా! గర్వోక్తులతో నేమి ప్రయోజనము?

క. తనరూపము, తనవిద్యయుఁ
దన నేర్పును దనగుణంబు దనగానము, గ
న్గొని యెవఁడు సంతసింపఁడు?
తనవిషయము నెంచ నోరులె తగువారుసుమీ!

మఱియు నీ వనినయట్లు మనము ప్రయోగకుశలులమే యయిన నంతమాత్రమున సభాసదులు సంతసిల్లరు. ఏమనిన—

చ. కృతి రసవంతమయ్యు మది కింపొనగూర్చదు నాటకు ల్సమ
ర్థతమెయి నాడకుండిన; బ్రదర్శకు లెల్లఁ బ్రయోగపద్ధతి
న్నతురులె యైన నేమి కృతి చప్పని దైనపు; డాప్రయోగము
న్కృతియును మంచిదైనపుడె నిండుముదంబు బగుఁ జూచువారికిన్.

పారి—అట్లయిన గ్రంథచమత్కృతియుఁ బ్రదర్శకులసామర్థ్యముఁ గనినాటకు, సభాసదులుమాత్రము నేర్పరులయి యుండవలదా?

సూత్ర—ఓయీ! ఇటు వినుము?

తే. గీ. కవియు నాటకు ల్నేర్పరు లావలయును
సభ్యు లగువార లెప్పుడు చతురమతులె
కంటకత్తియ జాణ గావలయుఁ గాక!
తనసెడునారికేఁ దదుర్చిను ద్దెలియకున్న?

పారి—సరే! చతురమతు లయినసభాసదు లందఱు కావ్యమునందును మఱి ప్రయోగమునందును గలగుణమ్ముల గ్రహించి యానందింతురు గాక!

సూత్ర—గుణగ్రహణపారీణులే యట్లు చేయుదురు. తదితరులు దోషాన్వేషణముం జేయుచుందురు. అయినను నీ నాటకమును బ్రయోగించునపు డీసభాసదులతో నిట్లు మనవిచేయుమని కవి యానతిచ్చియున్నాఁడు.

తే. గీ. సత్కవి యొనర్చు కావ్యంబు సరసమౌట
స్వచ్ఛమై రసవంతమై సౌఖ్యద మగుఁ
గుటిలధీవరు లీసమూలు గ్రోలలేక
నీచగతి విసారములకై నెమకికొండ్రు. 7

మఱియు

తే. గీ. శ్రీపురాణపండకులాబ్ధి శీతకరుఁడు
సరసుఁ డాంధ్రగీర్వాణభాషావిదుండు
మల్లయార్యుండు నా మేనమామ యగుటఁ
గవిత యెటులున్న నీకృతి గణుతిఁ గాంచు. 8

పారి—అయ్యా! నీవు సభాసదులతోఁ జెప్పవలసిన దంతయుఁ జెప్పితివి గనుక నేనిఁక నాటకప్రయోగమున కారంభించెదను.

సూత్ర—వేషము లన్నియు సిద్ధము చేసితివా?

పారి—సిద్ధమయి యెంత సేపయినది? అదిగో! మనసుమిత్రుఁడు నరేంద్రుని వేషము వైచికొని మహావైభవముతోఁ గొలువుండుటకు ముస్తాబుపడుచున్నాఁడు.

సూత్ర—(చూచి) ఔనౌను. ఈసభాసదులతో నింకొకమాట మనవిచేసి పోవుదము. ఓసదస్యులారా!

మ. అనురాధీశుని కొల్వుఁ జూచి యటపై నయ్యూర్వశీసుందరీవా
క్యము లాలించి సుఖించి, ద్వారకను సత్యాపద్మగంధీసమే
తు మురారాతినిఁ గాంచి, మీఁద హరి దైత్యుల్ పోరు సంగ్రామమ
ధ్యమునం దించుక నిల్చి, మీమనసు లత్యానందముం బొందుతన్. 9

(అని యిద్దఱు నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.

# ప్రథమాంకము.

రంగము—ఇంద్రసభ.

(అప్పుడు పీఠములమీఁదఁ గూర్చుండి మహేంద్రుఁడు, బృహస్పతి, జయంతుఁడుఁ బ్రవేశించుచున్నారు.)

మహేం—(విచారముతో నిట్టూర్పు విడిచి) ఆచార్యా!

చ. పొడ వడఁగెన్ హిరణ్యకశిపుండు, గతించెను దారకాసురుం
డడఁగెఁ గథావశేషుఁ డయి యాదశకంఠుఁడు. మాకిఁకన్ భయం
బుడిగె నటంచు నీత్రిదివముద్ధృతదానవకంటకంబ యు
య్యెడఁ గద యంచు నేఁ దనర నీనరకుం డెటునుండి వచ్చెనో.

బృహ—మహేంద్రా! ఎటనుండి వచ్చెనో యననేల? పద్మగర్భుని యవి మునుఁగొడియుం మన మందభాగ్యమునుండియు—

ఆ. వె. మొదలఁ జేసినాఁడు పిదప దైత్యుతపంబు
మెచ్చినాఁడు వరము లిచ్చినాఁడు
వేల్పుఁబెద్ద యనుచుఁ బేరు పెద్దయె కాని
యతఁడు చేసె మనకు నధికహాని.

మహేం—పద్మగర్భునినిందించుటకన్న మనభాగధేయమును దూరుటయుక్త నేఁ జేసినదోస మేమోకాని యీనాపరిపాలనము దినదినగండము వేయేండ్లాయు వన్నట్లు లున్నది. ఒకరాక్షసుఁడు గాఁడు. ఒకనాఁటి పరితాపము గాదు. ము జగంబులకు నేకచ్ఛత్రాధిపత్యంబు వహించి ముప్పదిమూఁడుకోటులదివ్యులకు నాయకుఁ నయ్యు నేను తృణకణము నసురభీతిచే గుండెలు చేఁతఁ బట్టుకొనియుంటఁ నాలోనాకె సిగ్గగుచున్నది. అనవరత చిత్తసంక్షోభకారణ మయిన యీసామ్రాజ్యం నేలుటకన్న నిరపాయంబును, నివృత్తసకలలోకవ్యాపారంబును, నిర్మనస్తాపమును న మునివృత్తిఁ బూని నారాయణచరణంబు శరణంబుగాఁ గానలనుండ సముచితం తోఁచుచున్నది. అసురపక్షపాతి యగు నబ్జనాభుం డెన్నెన్ని యవతారంబు లె యెత్తి యెందఱు దైత్యులం దునిమినను నిర్జరులభాగ్యదోషమున వారికులంబులు తాక తెంపనిలయి నానాఁట నభివృద్ధిఁ జెంది యిసుక పాతరలట్లు తెలుగకున్నవి. సాప త్తంబును, గుణగ్రహితంబును నగు నాయధమదానవానీకంబునకు వంగివంగి జో

లానర్పలేక, యొదిఁగియొదిఁగి యుండలేక, సపర్యలు సలుపలేక, విసిగిపోవుచుంటిని. ఈనరకాసురుండు మ్రుచ్చుఁదనమున సోమకునికన్నఁ, గ్రౌర్యంబునఁ దారకునికన్న, మగఁటిమి హిరణ్యకశిపునికన్నఁ, బరకాంతాసక్తి రావణునికన్న, మిన్నయఁట. విశేషించి లోకభయంకరుండు మురుండును, దుష్కారారంభుండు నిశుంభుండును, గ్రూరస్వభావుండు హయగ్రీవుండును, శౌర్యధనుండు పంచజనుండును వానికిం బాసటయయి వచ్చి నాలుగుభుజంబు లట్లుపచరింతురు. ఇంతటి వారిపై నరిగిన మనబలంబుగతి యేమి యయ్యెనో తెలియదయ్యె. నేఁ డదియేమోకాని శూరజనసులభ మగునుత్సాహము నాహృదయమున నెలకొనియుండ లేదు. నామనస్సు పరాజయము నే శంకించుచున్నది.

బృహ—మహేంద్రా ! వెఱపు నేఁటికి ?

తే. గీ. మూఁడుఁదలఁచిన మేల్కీళ్ళు నీడ లట్లు
ధృతియు భీతియుఁ బొడసూపు హృదయమందు
సాధుజనములు వానిసూచన లెఱింగి
భావికతుల బుద్ధిని నెంచి పని యొనర్త్రు. ౩

వెఱచినమాత్రమున నాపదలు దూరమునకుఁ బోవు. ధైర్యమూనిన నవి సమీపమునకు రావు. వగచి చేయునది లేదు. కావున నుదారపురుషలక్షణ మగుధైర్యము విడిచి యుండరాదు.

జయం—ఆచార్యా ! అమరేశ్వరున కింత వెఱఁగుపాటుఁ గలిగించు నాదైత్యుఁ డెవ్వరి కుమారుఁడు ? ఏమిసహిమవాఁడు ? ఈయుదంత మెఱిఁగింపఁబోలు నేని నా కెఱిఁగింప వేఁడెదను.

బృహ—వత్సా ! ఎఱిఁగింపరాకేమి ? చెప్పెద వినుము. వినియుండవు గదా ! తొల్లి భువనకంటకుఁ డగుహిరణ్యాక్షుఁ డనుదానవకులసార్వభౌముఁడు కలఁ డని. అతఁడు తనమగంటిమి నిర్జరుల కజేయుఁడై భూమిదేవిని సలుగులఁబెట్టె నాకారణమున ననవరతము దేవపక్షపాతి యగునారాయణుండు శ్వేతవరాహరూపమెత్తి యారక్కసుఁ బరిమార్చి భూమిదేవిని నుద్ధరించి తనకొమ్మున ధరియించి బుజ్జగించె. అప్పుడు పుణ్యపు ముసకును భగవతి యగువసుంధరకును నరకుఁడు జన్మించె. పదపడి వాఁడు తనతపోవిశేషమున వారిజాసనుని మెప్పించి వరములఁ బడసి మర్త్యలోకము జయించి దివమును జుట్టుముట్టి యిప్పుడు మనకు వెఱపుఁగొలుపునంతవాఁ డయ్యె.

జయం—(ఆశ్చర్యముతో) ఏమి ? భువనరక్షణపరాయణుఁ డగునారాయణునకును, విశ్వహితకారిణి యగుధారుణికిని నుదయించిన నందనుఁడో యితఁడు ? ఈతఁడు దుర్వ్యాకర్మములకు నేను దీనానిరక్కసుఁ డెట్లయ్యెను ?

బృహ—కుమారా ! ఆశ్చర్యమేల ? చూడుము.

తే. గీ. నిఖిలజనులకుఁ జల్లనినీడ నిచ్చు
వృక్షశాఖలు రాపాడు వేళలందు
పొడము నగ్నికణము కాల్చునడవు లెల్ల
జన్మభూమితో నేమి యసాధువులకు. 4

మహేం—కుమారా ! అది యట్టిద. చూడుము.

తే. గీ. జలదములనుండి పిడుగులు జాలునట్లు
మంచివారికి ఖలులు జనించుచుంద్రు
మంటిలో నుద్భవించెడు మణులలాగు
ఖలులకడుపున నుత్తము ల్గలుగుచుంద్రు. 5

జయం—అయ్యా ! మీరు సెలవిచ్చినదంతయు నిశ్చయము. దానవకులక్రమాగతం బగు కాఠిన్యమునకుఁ దోడు రణస్థైర్యంబునను నప్రతిహతప్రతాపంబునను వాఁడు క్రమంబునఁ దల్లిదండ్రులఁ బోలిపుట్టెఁ గావున నతఁడు నిర్జరుల కజేయుఁడని తోఁచుచున్నది; యుద్ధవార్త దెలుపుటకు సమరరంగంబునుండి యింతవఱకు మనఘటుం డొక్కఁడు రాకుండుటకుఁ గారణ మేమయి యుండును ?

బృహ—అదిగో నెవ్వరో యిటు వచ్చుచున్నారు. (పోల్చిచూచి) కుబేరపరిజనుఁ డగుమాణిభద్రుఁడు.

మహేం—ఈతఁ డేమివార్త చెప్పనోకద ! ముఖవైఖరి కీడును సూచించెడును.

(అప్పుడు మాణిభద్రుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

మాణి—(తనలో) కటకటా ! నేను మిక్కిలి మందభాగ్యుఁడను. ఈశ్రవణకఠోర మగువార్త మహేంద్రునకు నే నెట్లు విన్నవింతును ? అయినను స్వామి యగు కుబేరుని నియోగము నడుపక తప్పదుకదా !

చ. అనుపమధర్మమార్గచరులై నసుపర్వులు పోఱుచుంట ను
ర్జనులు కృపావిహీనులును రక్కసు లాజి జయంబు గాంచుటల్
గనుఁగొన ధర్మమే జయముగాంచెడు నంట యబద్ధ మంచునుఁ
ఘనభుజసారమే విజయకారణ మంచును నేఁ దలంచెదన్.

(ప్రకాశముగా) రక్షింపుము. రక్షింపుము. త్రిలోకాధినాథా ! (అని పాదములమీఁద బడుచున్నాఁడు.)

మహేం—(సంభ్రమముతో) ఓహో! ఏమి మూడినది? దేవసేనల పరాజయ
మెఱింగింప వచ్చితివా?

బృహ—నాకలోకము ముక్కుడిరక్కసులపా లయినదా?

జయం—దేవకాంతల యదృష్టములు విపరీతములై యున్నవా?

మాణి—(లేచి) దేవా! మందభాగ్యుఁడ నైన నేను దేవరకు దేవసేనలవిజయ మంగళవార్తలు దెలుప నోచుకొననైతిని.

మహేం—ఆ దేవాసురసమరము మన కశుభపరిణామ మెట్లయ్యెనో సంగ్రహముగా మాకెఱింగింపుము. కాలోచితముగ వలయు ప్రతిక్రియ యొనర్చుకొందము.

మాణి—(అంజలిపట్టి) దేవరవా రవధరింతురుగాక! ఆవిధమున ముర, నిశుంభ, పంచజన, హయగ్రీవ సమధిష్ఠితంబు లయి దైత్యదానవానీకంబులు లోకంబులు మ్రింగులాగున నార్చుచుఁ జేర్చి నిల్చిన, యమ, యాదఃపాల, దహన, ధనద, పవన, పశుపతి, ప్రముఖు లగుదిక్పాలకులు వేలుపుమూఁకలం గూర్చుకొని యరదంబులు, ద్విరదంబులు, బాణంబులు, తూణంబులు, హయంబులు, భటచయంబులు, నాయత్తంబు గావించుకొని మొగ్గరంబులు పన్ని యెదుర్కొనుటయు నుభయబలంబులు నోహారిసాహరిఁ బెనఁగి సమరం బొనర్చె. అప్పుడు నిర్దగ్ధసైన్యారణ్యంబునయిఁ గాఱుచిచ్చువచ్చిన దైత్య నాయకుఁడు పెచ్చు పెరిఁగె.

✓ సీ. కఱకుఁగత్తులఁ బూని కౌబేరబలములఁ జెఱకుఁగడ్డల నట్లు నఱికినాఁడు
మఱికాలఁ జెలరేఁగి యగ్నిదేవునిమూఁక సన్నచీమల నట్లు నమిలినాఁడు
మరగుడు చేతనుఁ బూని కదిసి వారుణసేన నాలుగుండల నట్లు త్రోసినాఁడు
శరపరంపర లేసి జనుబంట్ల మేనులు చించిజల్లెడ లట్లు చేసినాఁడు
క్రొవ్విల్పులుఁబోలు దైత్యులకోల్తలఁ జెడి
వేల్పు లల మేఁకలటుపాఱి విఱుఁగవలసె
దిక్కు లేనివార లోదివిజనాథ!
దిక్కుమాలినవార లై తిరుగవలసె. 7

మఱియు సేనలు పోయినపోకగాఁ దిరిగి చూడక చనుటయు,

తే. గీ. మన కృశానుని తేజంబు మంటఁ గలసె,
నాఁటివరుణదేవునిశక్తి నీటఁ గలసె,
నెపటికో వాయుబల మెల్ల నెగిరిపోయెఁ,
శక్కి సగ మయ్యె నీశానుఁ డుక్కు దక్కె.

మహేం—(విచారముతో) అన్నన్నా! ఎంతకష్టము! అవ్వల నేమయిన

మాణి—అనంతరము సంగ్రామప్రసిద్ధు లగుసిద్ధులును, రిపుజనదుస్సహ్యు లగు సాధ్యులును, పరాక్రమహార్యక్షు లగుయక్షులును, ధనుర్విద్యాధరు లగువిద్యాధరులును గరుడగంధర్వాదు లగుతక్కుంగల ఖేచరులును, నిశాచరులం దలపడిరి.

బృహ—దైవము వారి కయినఁ దోడుపడక పోయెనుగా ?

మహేం—దానవులకుఁ దోడుపడియె ననుఁడు. ఆతరువాత నేమి జరిగినది ?

మాణి—ఏమి జరిగినది యని యడుగ నేల ? ఈ యశుభము తుదముట్టఁ జెప్పెద వినుండు.

తే. గీ. అసురసేన విజృంభించి యంతఁ దఱుమ
వేల్పుజోదులు వెన్నిచ్చి విఱిగి చనిరి
యొకఁడు పోయినదెసకు నింకొకఁడు పోక
తెగినహారంబులోని ముత్తియము లట్లు.

బృహ—సరే. ఇంక వినవలసిన దేమి యున్నది ?

ఆ. వె. జ్వలనదేవుఁ డోడె, జలధినాయకుఁ డోడె,
దండపాణి యోడె, ధనదుఁ డోడె,
కూల్చువాఁ డెవండు కుటిలదైత్యులఁ గర్మ
ననుభవింపవలయు నంతెగాక.

మహేం—అయ్యో! మాణిభద్ర! ఇప్పుడు నాయనుంగునెచ్చెలు లగుదిక్పా లెం దున్నవారు ?

మాణి—దేవా! ఎం దున్నవా రని తెలుపుదును ? కొందఱు పలాయితు ల యుండ దానవులు వారినిఁ బట్టుకొని బంధించి శిబిరంబుల నుంచిరి; కొందఱు వాహ బుల నెక్కియు మఱికొందఱు పాదచారు లయియుఁ దల విరియఁబోసికొని వెన చూడక పోయెదుచో వెఱుంగక దానవులబారిఁ బడక తప్పించుకొన నూడనిఁ బా యుండిరి. కొందఱు పఱువిడ లేక యెందేని నక్కి ముక్కియున్నవారు.

మహేం—హా సఖులారా! దిక్పాలులార! మీకెట్టిగతి ప్రాప్తించెను ? ఓం దండధర! ఎన్నడును నీడవోని నీకాలదండమునకు నేఁ డింతపాటు వచ్చెనే! ప్రతాపప్రకంపితకాలకంఠుఁ డగుదశకంఠునిఁ బూరికిం గొనని నీ మగఁటిమి తుచ్చ డగునరకుని మ్రోల మొక్కవోయెనే ? ఓయివరుణా! మృత్యుజాలసంకాశంబు లగు శంబులు దనుజకంఠప్రదేశంబుల నిరర్థకంబు లయ్యెనే ? అగ్నిదేవా! శాత్రవ

తూలంబులం గాల్చునీకీలంబులు దనుజులకుఁ జంద్రకిరణజాలంబులయి తోఁచెనే? ఓయీ నైరృతా! 'వజ్రం వజ్రేణభిద్యతే' యన్నట్లు మాయాబలాభిశోభితు లగుదానవులను దానవాంశమునఁ బొడమిన నీవు నిర్జింతు వని కొంతయాశతో నుంటిమి. అదియు ల్ల ష్మయ్యె. మిత్రమా! కుబేరా! నిగ్రహానుగ్రహసమర్థుఁ డగుభగవానుఁడు కాలకంఠుఁడు నీకు సంగడికాఁడై నిను గాచుచున్నను నీ కీపాటులు దప్పవయ్యెను.

ఆ. వె. నరకుఁ డెంతవాఁడు నారాయణుఁడు తోడు
మదనవైరి తోడు మన కంటుండఁ
ఇంత దక్కియుండెఁ జిట్టి లింతలు పుట్టి
నుక్కు చెడదె గాల్చె లక్కసీల. 11

జయం—అయ్యా! మిక్కిలి యధైర్యము వహియింప నేల? ఆపత్సమయంబున బ్రాజ్ఞు లనుసరింపఁదగినమార్గ మనుసరింపుఁడు.

మాణి—మహేంద్రా! ఊరక యధైర్యముపడి యేమి చేయుదురు? ఇంకను నాలోచించవలసిన దించుక కలదు. నేను చెప్పునది సాంగముగా విని సమయానుకూలముగా నెయ్యది కర్తవ్యమో దాని నొనర్తురుగాక!

మహేం—అట్లయిన నీ చెప్పవలసిన దంతయుఁ జెప్పుము వినుచున్నాఁడను.

మాణి—సిద్ధమిట యక్షేశ్వరుఁడు కుబేరుఁడు రణరంగమునుండి తొలఁగి త్రిహయముపైఁ గూరుచుండి పరుగిడుచు మార్గాయాసముచేత వగర్చుచు నెంతయుఁ గష్టమున నన్నుఁజేరి తను కిట్లు సందేశ మంపెను. "త్రిలోకాధినాథా!"

ఉ. నే నిటు లైతి; నాజి రజనీచరవీరుఁడె గెల్చె; వాయువు, వై
శ్వానరముఖ్యులుం దొలఁగి పాఱిరి, కావఁ గదయ్య నందనో
ద్యానము, నంగనాతతి, సుధాకలశంబును, పారిజాతసం
తానముఖామరద్రుమవితానమును, స్మరకామధేనువుల్. 12

మహేం—మిత్రమా! కుబేర! ఆపత్సమయమునందును స్వామిహితమును మఱవని చరిత్రము శ్లాఘాపాత్రము. ఓయీ! మాణిభద్ర! అట్లయిన నిప్పుడు రాక్షసేంద్రుని యుద్యమ మేమి?

మాణి—దేవా! దురాత్ము లయినశత్రువులు జయమొందినపుడు సామాన్యులను పగతుర నేమి సేయుదురో యదియే వాని యుద్యమము.

బృహ—అది యేదో తేటతెల్లముగా నెఱింగింపుము.

మాణి—దానవబలంబులు దేవబలంబులను నుఱుమాడి వెన్నంటి తఱుముచుండ ఘోరంభీరభీషణంబు లగుభాషణంబులతో రాక్షసరాజు తనబలంబుల కిట్లనియానతిచ్చె.

ఆ. వె. పూలతోఁట లనక పుణ్యభూమి లనక
రాచనగరు లనక రచ్చ లనక
వేల్పుఁబోఁడులు సొచ్చి మీరదానవులార !
కొంకు జంకు లేక కొల్లఁగొనరొ.

బృహ.—అట్లయిన మనము మనజాగరూకతమీఁద నుండవలయును.

మహేం.—అయ్యా ! ఎయ్యది యీయవసరమున దాచరణీయమో యెయ్యది యనాచరణీయమో నే నెఱుఁగఁజాలకున్నవాఁడ. మును నేను చన్న తెఱఁగునఁ గానున యున్న తెఱఁగును విన నామనమున సమరసన్నాహోత్సాహంబు డిందుపడినది. తీవంబు విజృంభించిపోవుచున్న పరిజనంబులు పదుగురు చాట్లు దలంపునకు వచ్చి నన్నుఁ గాగదపనీయవు. దానవు నెదుర్కొందమన్న వాని నోర్చుటరిది. కావున నిప్పుడు నే మార్గ మవలంబింపవలయునో మీరు నిర్ణయింపవలయును.

(తెరలో)

ఓహో ! సిద్ధ, సాధ్య, విద్యాధర, గంధర్వ, మరుత్తు, కిన్నర, ఖేచరులారా ! త్రిలోకనాథుఁ డగు మహేంద్రుఁ డెందున్నాఁడు ? ప్రాగ్జ్యోతిషాధినాథుఁ డగు దానవేశ్వ డాతని దర్శనము చేయవచ్చినాఁడు. కావున నాతఁ డున్నతావు తెలియఁగింపుఁడు.

బృహ.—(ఆలకించి) కడపటిపని చేయుటకు శత్రుసాధముఁ డిదిగో నిదె వచ్చినాఁడు.

మహేం.—ఆచార్య ! ఆచార్య ! కర్తవ్యము ? కర్తవ్యము ?

జయం.—అంతఃపురరక్షణ మవశ్యకర్తవ్యము.

బృహ.—మహేంద్రా ! ఆ. వె. శౌర్యశక్తిఁ గలఁపఁ జనక యుండుట మేలు
శత్రుధాటిఁ దలఁపఁ జనుట మేలు
రెండు పోల్చిచూడ మొండికక్షకు నరు
సకల మిచ్చి చనుట చాల మేలు.

మహేం.—అట్లయిన స్త్రీలగతియేమి ? తక్కుంగలవారి గతి యేమి ?

సీ. కనఁబడ్డసతినెల్లఁ గవయఁగాఁ జేడనీచు గారవించునె వేల్పుఁ గన్నియలను
మాపేరు వినినంత మండిపడెడుదాయ ముద్దుసేయునె నాదుపుత్రకులను ?
స్వర్గసంతతియుఁ బాడుసలుప నెంచెడుకూళ విడిచిపోవునె కల్పవృక్షములను
మునిగణాగమనుల మ్రుచ్చిలించెడుపాపి యపహరింపఁడె వేల్పుటావు
కరుణ యెట్టిదో యెఱుఁగని కటిక చనటి
బ్రతుకనిచ్చునె యింక నైరావతమును ?

ముజ్జగంబులదొర కింత మూఁడు ననుచు
నించుకేనియుఁ గల నేని నెఱుఁగనైతి. 15

బృహ—వాఁ డెంతఘాతుకకర్మనయిన నొనర్చుటకు సందేహింపఁడు. కావున రలను, దక్షుఁగల వియచ్చరాంగనలను మేరుపర్వతగుహలకుఁ దోడ్కొని పొమ్మని యంతకుమారు సంప్రతి యుచితము. అమృతభాండమును గానుగవియు వారలతోఁ బోఁగాక!

మహేం—అట్లయిన నింక జాగు సేసిరించిన ప్రయోజన మేమి? వత్సా! జయంతా!

చ. తడయకు మున్న దానవకదంబము సేరకమున్న వేలుపుం
బడఁతులతోడ మీజనని భద్రముగాఁ గొనిపోఁ గదన్న కా
ఱడవులకైనఁ బర్వతగుహాంతరభూములకైనఁ జొచ్చి ర
క్షసావఁగఁ గొంతకాల ముటఁ బ్రసన్నుఁడవత్తువుగాక యిందఱున్ 16

యుఁ బులోముని గాగపుఁబట్టియుఁ జతుర్దశభువన నాయకుని పట్టపుమహిషి యుం, యంపశ్యయు నగు మీయంబతో నాలుబిడ్డలసంగతుణము సేయఁజాలని వజ్రపాణి చెప్పె నని పలుకుము.

చ. సునముసఁ దొంటిసంపదలమాట దలంపకు, శోక మెచ్చు; నో
క్కనెలవునంద కష్టములు గాపుర ముండునె యెల్లయప్డు; మే
ల్దినములు వచ్చు, వెండియును దివ్యులకో సఖి! యాకురాలు నే
శను జిగిదూలుచెట్లు మరల న్మనుమాసమున న్జిగుర్పవే?

జయం—దేవా! అట్లయిన మీ రానతిచ్చినట్లు చేసెద. (అని పోవును.)

(తెరలో)

చ. తునియలుగాఁగఁ గొండలను దున్రించినదోర్బలశాలి, యీయహ
ల్యను వలపించినట్టిరసికాగ్రణి స్వర్గపురైకనాథుఁడున్
గను లొకవేయి దాలిచి జగత్త్రియము న్గనిపెట్టునేత, య
య్యనిమిషనాథుఁ డేఁడి, దనుజాధిపుఁ డాతనిఁ జూడఁ గోరెడున్. 18

బృహ—అదిగో నడచుచున్న తమాలవృక్షములో, పుంజీభూతము లగు కాలములో, యన రాక్షసులు మన మున్న దెసకు వచ్చుచున్నారు. ఇదియును నేఁ టే. జయంతకుమారుఁడు కాంతాసంతానమును నిరపాయముగాఁ గొనిపోవుచున్నాను.

మహేం—ఆచార్య! నీవు డితనితో నెట్లెదుర్కొని సంభాషింతము? సామములతోఁ బట్టుపఱచిన సంధికి నంగీకరించునేమో?

బృహ—ఎంత వెఱ్ఱివాఁడవు! దురాత్ముఁడు శాంతవచనములఁ జిక్కుఁబడునే?

తే. గీ. అధముఁ డగువాని సామవాక్యముల యోగ్యు
లనునయింప నాతనియల్క యినుమడించు
నెఱయఁ గ్రాగినచమురుపై నీళ్లుచల్లఁ
బొఁగయు మంటయుఁ బుస్సన నెగయునట్లు.

మ హేం—అట్లయిన సతఁడు రాకమున్న యనుష్ఠేయము నుపదేశింపుఁడు.

బృహ—అది యీవఱకే యుపదేశింపఁబడినది. అయినను మఱియొకమాఱు చెప్పెద. ఆదానవుఁ డీకొలంవుకూటముంజొచ్చినతోడనే నీవును నేనును మనవైరము మనమనములనుండి దూరముగఁ దోలి యతని సబహుమానంబుగ నెదుర్కొనిచింతామణిఖచిపీఠంబున నాసీనుఁ గావించి నాకభువనంబును, నందనవనంబును, గల్పభూరుహంబును గనకాంబుజములు వాని కొసంగి మనము దొలఁగుట కార్యము.

మ హేం—మన మెచ్చట నుండవలసినవారము?

బృహ—మేరుగుహలచెంతనో, మానససరోవరముపొంతనో?

మ హేం—మన కీదుఃఖమునుండి విమోచన మెప్పుడు?

బృహ—రాక్షసుని మరణసూచన మెప్పుడో యప్పుడు.

మ హేం—అది సంభవించు టెట్లు?

బృహ—ఇట్లు. అశ్రితావనపరాయణుఁ డగు నారాయణుఁడు దుష్టదానవనిగ్రహంబునకును, శిష్టమానవానుగ్రహంబునకును యాదవవంశమున నుదయించెనని పరమేష్ఠి సనత్కుమారునకుఁ జెప్పుచుండఁ దొల్లియొకనాఁడు నేను వింటిని. మనమా దేవకీనందనునాశ్రయించి యీవిపత్సాగరము నీదుదము. అతనిచేతఁ గాని తదన్యునిచే నీలోకకంటకుఁడు పిల్కుమారఁడు. మేటిరాక్షసులఁ బోకార్ప సతఁడు కంకణము గట్టియున్నవాఁడు. ఆ నందనందన చరణారవిందములపాలఁ బడినవారు చెడినవారు లేరు.

మ. అగదంకారము లాజవంజవతమోహారప్రభావంతము
ల్జగదానందదముల్ సురారియువతీ సౌభాగ్యలుంటాకము
ల్నిగమోర్వీజశిఖాప్రవాళములు కాళీయాహినిర్బంధముల్
భగవంతుం డగు దేవకీతనయు శుంభత్పాదపంకేజముల్.

కావున నాపుండరీకాక్షునకడకు మాణిభద్రుని నుచితసందేశముతోఁ బుత్తెంచుము. మన నెంజిలి సమగ్రముగాఁ దీఱును.

మ హేం—అవివేకాంధకారాతిశయమునఁ దెన్నుఁగానక తిరుగులాడుచున్నామనస్సునకు మీవచోదీపికలచేఁ జక్కనిదారి పొడకట్టినది. అట్లొనర్చెద. అయ్యా మాణిభద్ర! నీవు మాకుదూతవై యుమరకార్యముం దీర్పవలయు. ఇదిసకలభువనవిహా

మాణి—దేవా! ఆజ్ఞాపింపుము. సేవకున కిది మహాప్రసాదము

మహేం—అట్లయిన నో మాణిభద్ర! జగద్భద్రసంధాయకుఁ డగు వాసుదేవుఁడు సము సేయు ద్వారకానగరమునకుఁ జని యదుకులకమలాకరప్రభాకరుం డగు పుండరీకలోచను సందర్శించి దివౌకసులయార్తి సమగ్రముగా విన్నవించి,

సీ. కాళీయఫణిఫణాగ్రములఁ దాండవమాడునడుగుఁదమ్ములకు జోహారు లనుము
ఆదితికశ్యపులకు నవతరించినవాఁడు మా కొనర్చినమేలు మఱవ ననుము
అమరసంతతి యిట్టు లగచాట్లు పడుచుండ నోరనిక్రైవడిఁ జూచు టొప్పదనుము
ఈతెఱంగునఁ జేయ లాఁతివారమె మేము చాలకాలమునాఁటిసఖుల మనుము
అలుబిడ్డలదెసఁ జూచి యమరవిభుఁడు
వేయుఁగన్నులబొప్పుము ల్విడిచె ననుము
అసురఁగడతేర్చుపని తన కలఁతి యనుము
దైవహిత మాట నీయది తప్ప దనుము

మాణి—దేవా! అట్లంతయుఁ విన్నవించెదను.

బృహ—దానవుఁడు వచ్చువఱకు నీ విటనుండి యతనిపల్కులువిని చెయిదములఁ [illegible]ల నరుగుము. అప్పుడు నిర్జరులయవస్థ యాదవేంద్రునకు సమగ్రముగ దెలుఁప నవకాశ ముండును.

మాణి—హా! కష్టము. కష్టము. దానవసైన్యంబులు సమీపభూములకు [illegible]నవి.

బృహ—మహేంద్రా!

చ. మనమున నించుకేని యనుమానము నొందక దానవేశ్వరు
న్ననివినయంబుతో నెదురుగాఁ జని గద్దియఁ జేర్చు; లావు మా
యనపుడు సల్పఁడై యొదిగియుండుట న్యూనత గాదు; గ్రీష్మమం
దున బలుతిప్పలుంబడునదుల్ వలుకారునఁ బూర్తిఁ జెందవే? 32

ఓ సునాసీర!

తే. గీ. అధికతేజస్సులకు నైన నప్పుడప్పు
డుచ్చనీచదశలు గల్గుచుండుఁ జూవె
జగము వెలయింపఁగల సూర్యచంద్రులకును
గ్రమత నుదయాస్తమయములు గల్గునట్లు. 33

మహేం—దేవగురువులయుపదేశము శిరసావహించినాఁడ. (అప్పుడు నరకాసురుఁడు, పంచజనుఁడు, వజ్రకంఠుఁడుఁ బ్రవేశించుచున్నారు.)

నర—ఓయీ పంచజనుఁడా! బాహుబలంబున, బుద్ధివైభవమున మనకన్న నల్పుఁడగు మహేంద్రుని సింహాసనభ్రష్టునిఁ గావించి నాకలోకమునుండి పాఱఁదోలక మన వంశకర్తలగు నాదిదైత్యుల నూరకుండుటకుఁ గారణ మేమి?

పంచ—దేవా! ఆమహాత్ము లూరకుండలేదు. దివిజదుస్సాధ్యవిక్రమక్రీడారంబయి పూర్వులు త్రిలోకవిజయంబు గాంచినపుడు కుటిలుఁడగు విష్ణుదేవుఁడో మఱి లేని శంకరుఁడో యేవో రూపములెత్తి వారలఁ గడతేర్చుచుండువారు. ఆకారణంబున నీతని కింతవైభవము జరుగుచున్నది. ఈపర్యాయము మీరన్నట్లు నిరాటంకముగా జరుగఁగలదు.

నర—(నవ్వుచు) మనదానవవీరులు నిజముగా నాదామోదరునిచేత సంయుగ నిహతులయిరా? అట్లయిన వారిపరాక్రమ మెట్టిదో చూడవలసినదే.

వజ్ర—మహాప్రభూ! వారువట్టిపిఱికివారు. మీవంటివీర వారు నిగ[illegible] నను బనికిరారు.

బృహ—మహేంద్రా! అదిగో దానవుఁడు. వాని నెదుర్కొందము రమ్ము.

మహేం—దానవేంద్రా! నీకు స్వాగతము.

బృహ—దానవేశ్వరా! విజయ మగుఁ గాక!

పంచ—నీ వన్నను ననకున్నను విజయ మావలకే యయినది.

✓ నర—(ఆశ్చర్యము నటించుచు నిందునితో) ఎవరు మీరు? నముచిగర్వనిర్వాపణధూర్వహులు, పాకప్రతాపగంధసింధురపంచాననులు, బలప్రాణానిలకాలభుజంగ వగునమాల్యాభుజంగులా? మహేంద్రా!

మ. అపరాధంబులు గల్గె మావలన చండారాతి సైన్యాటవీ
తపనోద్యద్దహనాయమానపటుదోర్దర్పప్రతాపాఢ్యు ని
న్నిపు డీరీతినిఁ జూడవచ్చితిని నే నిన్నాళ్లు రాకుంటకు
న్నృపతో డక్షమియింపు తమ్ముఁడఁ గదా యెంతైన దేవేశ్వరా!

అయ్యో! మఱచితిని. నేను మీకుఁ దమ్ముఁడ ననుట మిమ్ము రెండవమా అవనించుటగదా!

వజ్ర—అహాగళస్తనములవలె నిరర్థక మయినవజ్రాయుధము ధరించి యీ ప[illegible]క్రమహీనుని తమ్ముఁ డనిపించుకొన్న నీకశమానము మహాప్రభూ!

పంచ—ఓమహేంద్రా! ఓదేవగురూ! నేను పంచజనుఁడను; నరకసహో[illegible]బంటును.

బృహ—మేము మిమ్మెఱుంగకపోలేదు.

మహేం—దానవేశ్వరా! ఉల్లసపుటలుకులతో నేమి ప్రయోజనము? శత్రు రాజులపై దండు వెడలుట క్షత్రియధర్మ మగుటచే నీ విటు చేసితివి. ఇందు క్షమింప వలసిన దేమున్నది? జయము నొందితివని యెంచుదును.

మాణి—(తనలో) ఈసమయమున నే నిచ్చట నుండరాదు. నాటకసనుండి వీడ గని పెట్టెద (అని పోవును.)

నర—పురందరా! నామాటలకు నీ వింత యేండికెద వేల? అట్లయిన నింక నుల్ల సపుటలుకులతో నేమి? నావచ్చినపని చెప్పెద వినుము.

తే. గీ. ఎల్లభువనంబులకు నీవ యేలిక వట

బలము గలవాఁడ వట మానవంతుఁడ వట

కొంత తెక్కలఁ గొన్నింటిఁ గూల్చితి వట

యేది చూతము రణ మిమ్ము యించుకంత.

బృహ—(తనలో) మా యసహాయత్వము నెఱిఁగి వీఁడు మమ్ము మాటిమాటికి యుద్ధమునకుం బిల్చుచున్నవాఁడు.

మహేం—దనుజేశ్వరా! రణమున కేమి? అది యొక భాగ్యము కాదు. చూడుము.

క. కనుఁగొన దేవదానవులు కశ్యపుసంతతివార కావున

న్దనుజవరేణ్యా! యన్నలకుఁ దమ్ములకుం బగ జెల్లునయ్య? లోఁ

గినయుక మీరు మే మెపుడు క్షీరము నీరములట్టు లుండిన

న్మనలను దేఱిచూడఁ దరమా యొకమాత్రపువాని కాజిలోఁ.

నర—ఆహాహా! ఎంతకాలమునకు నేను మీకుఁ జుట్టము నయితిని?

పఠన—సోదరప్రేమ మహేంద్రునిశరీరమునుండి వెల్లివిరిసి పొఱలుచున్నది.

వజ్ర—పిల్లికి కెలంకలును, దోఁడేళ్లకు మేఁకలును నెంత దగ్గఱచుట్టములో మాకు మీరును నంత దగ్గఱ చుట్టములే.

బృహ—ఓ దానవసార్వభౌమా! ఈసు మహేంద్రుఁడు వచియించినట్లు సుసురయు వకులము లొందుపొసఁగియుండుట యుచితము. మీరు రాక రాక వచ్చినయతిథుల వే మా కాదరణీయులరు. అందుచేఁ గూరుచుండి ప్రసంగింతము. నీ వాసు మహేం ద్రము నధిష్ఠింపుము.

మహేం—దానవేంద్రా! అట్లు చేయుము. మాకు మీ రతిథులుగదా!

నర—ఓహోహో!

ఉ. ఎన్నఁడు లేనికూర్మి యిది యెప్పటినుండి జనించెనయ్య? నీ

కిన్నరకుండు లేవనిభుఁ డెక్కడకుక్కరనుకుచు నెక్కడివాఁడె? మీ

నన్నను నే నోర్వఁగలనా యది యయ్యెడి యెక్కువాఁడు తాఁ
గన్నులు వేయి దాల్పవలె గౌతమునింటను గోడి గావలెన్.

వజ్ర—నిజము. నిజము. అంతమహిమ గలవాఁడే దాని సహింపఁజాలెను. సా మీ మహేంద్రుఁడు కష్టపడి రేయి యనక పగ లనక కోడియో కుక్కయో యం వేయిగన్నులు దెచ్చుకొన్నాఁడు. అంతపాటిశక్తి యెవరికున్నది?

బృహ—(తనలో) రాక్షసుల యెత్తిపొడుపుమాటలు భరింపశక్యముగాకున్నవి.

మహేం—(తనలో) ఇంతకన్న శూలములతోఁ బొడిచిన మేలు. కటకటా! కాల మెంతలో మాఱినది!

బృహ—దానవనాయక! ఎన్నఁడో పొరపాటున నొనర్చిన లోపముల నెం యింతవానిని మీ రధిక్షేపించుట మీవంటి వీరపురుషుల కుచితము గాదు.

నర—అట్లయిన మీకు హితమగుపనియే యొనర్చెదను. చిత్తగింపుఁడు. ఓం సురేంద్ర! భూధరపక్షచ్ఛేదనశౌండ!

మ. ధరణీరాజ్యము వీరభోజ్య మని పెద్ద ల్చెప్పఁగా విందు ని
ర్జరలోకేశ్వర! రెండుపల్కుల కిటన్ బ్రత్యుత్తరం బిమ్ము నీ
కరమందుం గులిశాయుధంబుఁగొని సంగ్రామంబు గావింతువా?
సురసామ్రాజ్యపదంబు నాకుఁ గరము ల్జోడించి యర్పింతువా? 2

పంచ—మహారాజా!

తే. గీ. కాలుదండంబు, ధనదునికఱకుఁగత్తి,
వరుణపాశంబు, వసమీఁద వమ్ము లయ్యె!
వజ్ర మేటికి ధరియింపవలయు వీఁడు?
కొండలను ఱెక్క లుడుఁచి చెక్కుటకె గాక!

వజ్రి—దేవా! మీరు మాటాడనే యెన్నఁడో చచ్చినట్లు విశ్వేష్టల నీదేవరాజబృహస్పతులు యుద్ధము సేయుదురా? బలహీనులమీఁద నెగురు వస్న నీయనవంటివారు మఱియుండరు.

నర—మహేంద్రా! ఊరకయుండెద వేల? ప్రత్యుత్తరమిమ్ము.

పంచ—హరియో హరుఁడో తమకుఁ దోడ్పడువఱకు నిరుత్తరులయి యుంద కాఁబోలు?

వజ్ర—హరియా వచ్చుట? అతఁడు తనరక్షణముఁ జేసికొన్నఁ జాలు. వీ రక్షించినంత ఫలము.

నర—అన్నట్లున్నుఁచితిని, ఓ దేవరాజా!

మ. హర మీపాలిటి దైవతం బనుచు దైత్యధ్వంసి యంచు న్నుతిం
తురుగా మీరలు సర్వకాలమును జేతుల్మోడ్చి ; వాఁ డేఁ డీ ? యు
క్కరకు న్నోడది యేమి ? వచ్చి మిగుల న్గాంభీర్య మేపార ని
ర్జరుల న్బ్రోవ డదేమి ? పిమ్మట సమాశ్వాసింపఁ డావచ్చునే ? 30

మహేం—(తనలో) హరి నీవిధముగా నిందించు వీని కేమిగతి కలదో కదా ?

బృహ—(తనలో) ఇట్టివైపరీత్యములు కాలమాసన్నమైనవానియందుఁ గన్పట్టును.

వజ్ర—గురుశిష్యు లిద్దఱు బెల్లము కొట్టినరాళ్లవలె నూరకుండెద రేల ? మహా జున కేదో యొక ప్రత్యుత్తర మిండు.

మహేం—ఆచార్యోత్తమా ! ప్రత్యుత్తర మొసఁగుఁడు.

బృహ—దానవేంద్రా ! వేయుమాట లేల ? ప్రతాపానలపరిశోషితదిక్పాలకరుద్రులును ద్వణీకృతనారాయణులును నగు మీతో నెదురుగ నొసర్ప మహేంద్రుఁ డెంతవాఁడు ? అతఁడు సంధి యొనరిత మని యూహించుచున్నాఁడు.

పంచ—దేవదానవుల వైరము సంధి చేసికొనుటచేఁ జోకము తప్పినది.

వజ్ర—ఇంద్రుని కిప్పుడు భయజ్వరముచే నొక పెద్దసంధిరోగము ప్రవేశించినది.

[illegible]—మహేంద్రా ! అట్లయిన నానిశ్చయము విస్పష్టముగఁ జెప్పెద వినుము.

చ. పలుమఱు వింటి నచ్చరలపాటలు చేర్చితి వీవు మేను ని
ర్మలమృదుపారిజాతకుసుమంబుల సెజ్జలమీఁద నాకభూ
ములఁ జిరకాల మేలితివి పూర్తిగఁ జెల్లెను వంతు మీకు దై
త్యుల కిఁక వంతు చెల్లఁదగు నూరక పొందు తొలంగి వేలుపుల్. 31

లంతకాలము స్వర్గము పరిపాలించి రంతకాలము దానవులును పరిపాలింపవలెనని [illegible]రు. మఱియు స్వర్గమునుండి యొక్కపూరిపుల్ల యయినఁ గొనక యెందయినఁ బ్రతుకుఁడు. దీనికి విరుద్ధముగాఁ బ్రవర్తింతురేని యీనరసుఁడు వేల్పులపైఁ జాలిపడువాఁడు కాఁడని మీర యెఱుఁగుదురు.

పంచ—దేవా ! మీరు లెస్సగా సెలవిచ్చితిరి.

వజ్ర—ఈపాడుదేవతలు నేఁటికాలమునకు మాయెనుకు తగిలి పోవుచున్నారు.

మహేం—(విచారముతోఁ దనలో) రాజ్యలక్ష్మీ ! నీవు చంచల వనుమాట నిశ్చయ మయినది.

బృహ—(తనలో) అనుకొన్నదాని కేమియుఁ గొఱఁత కలుగలేదు.

మాలి—(తనలో) కటకటా ! త్రిలోకాధీశ్వరున కెంత కష్టమువచ్చినది ? ఇంక [illegible] నిలువఁజాలను. నాపని మీఁదఁ జోయెదను. (అని నిష్క్రమించును.)

నర—ఓయింద్రబృహస్పతులారా! మీయునికి నాకోపానలంబునకు ప్రజ్వ హేతువు. కావున మీ రిటనుండి సత్వరము పొండు.

వజ్ర—చుట్టుపట్టు పొలిమేరలోనైన మీరు కనఁబడుదురేని మీగుండెలఁ బ్రదిసిపోయెదను. జాగ్రత.

బృహ—మహేంద్రా! ఏల యాలస్యము? పోవుదము రమ్ము.

మహేం—(తనలో)

సీ. చిరకాలమునుండి సురలకాణాచి యా విబుధలోకంబును విడుచు టెట్లు?
చింతామణీభద్రసింహాసనం బున్న యమరావతినిఁ బాసి యరుగు టెట్లు?
మఘవైరిచిరజాబ్జమకరందరస మైన మందాకినీనది మఱచు టెట్లు?
సిరికిఁ దోఁబుట్టువై క్షీరాబ్ధి నుదయించుపారిజాతముఁ బాసి బ్రతుకు టెట్లు?
దినము నైరావతము నెక్కి తిరుగకుండ
కాలినడకను నట్టిట్టు కదలు టెట్లు?
నందనోద్యానవీథుల నడువకుండ
నిముసమైన నేఁ బెఱచోట నిలుచు టెట్లు?

(మహేంద్రబృహస్పతులు నిష్క్రమించుచున్నారు.)

వజ్ర—ఇప్పటికి నాకమునకు దరిద్రదశయంతయుఁ దొలఁగి శోభ కలుగు కాలము వచ్చినది. దేవా! మీ రీచింతామణీభద్రసింహాసన మధిష్ఠించి దేదీప్యమాన లతోఁ గొలువుదీర్చి మాకన్నులకు విందు సేయవలయును.

పంచ—దేవా! ఇప్పు డీపీఠము నెక్కవలదు. భగవంతుఁడును దానవ క్షేమంకరుఁడును నగుశుక్రాచార్యుని యనుమతంబునఁ బుణ్యదినంబున సుముహూర్త బున మీరు సురసామ్రాజ్యపట్టాభిషిక్తులగుట యుచితము.

నర—ఇది యవశ్య మాచరణీయము. ఇంతలో నాకలోకవైచిత్ర్యములఁ గ గొందము రండు. పట్టాభిషేకముకన్న ముందు మహేంద్రుని యంతఃపురమునకేగి య సూర్వశిని సందర్శించుటకై నామనంబు తత్తరపడుచున్నది. దానిచక్కదనము వ త్రితమని మును నారదాదిమునులవలన వినుచుందును. కావున సత్వరము పోదము

పంచ—చిత్తము. (అందఱు నిష్క్రమించుచున్నా





# ప్రసన్న యాదవ నాటకము

## ద్వితీయాంకము.

(అప్పుడు నందపాలుఁ డనురాక్షసుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

నందపాలుఁడు—(తనలో) ఛీ! ఛీ! ఈపాడుస్వర్గమున కేలవచ్చితిని? ఈయ మరావతీపట్టమును జూచినది మొదలు నాకు 'పేరుగొప్ప యూరుదిబ్బ' యనుసామెత వచ్చుచున్నది. ఈనగరము సకలవస్తుసంపన్న మనియు సకలసంపదలకు స్థానమనియు మహావైభవసమేత మనియు పలుమాఱులు మహర్షులు వేనోళ్లఁ బొగడుచుండ [illegible]లు వినుకొని నామనోరథము లన్నియు సఫలంబు లగు నని పుట్టెఁడాశతో వచ్చి తుదకు మోసపోతిని. మునులుముండకొడుకులు స్వర్గము పైఁ గలదురభిమానముచే నంతగా పొగడుచుందురే గాని దీనియం దేమిగొప్ప యున్నది? ఈమందాకినీనది యొక [illegible]మంత యున్నది. కాని యిందు నాకుఁ గావలసిన చేఁపలు, జెల్లలు, సత్తలు, కొత [illegible]య్యలు లేనేలేవు. నోటికి రుచిగా వండించుకొని తినఁగ నున్న నింత గూఁటికూరైన నిక్కడ లభింపదు గదా! ఈనదికన్న మాయూరిచెఱువే నయము. ఈనదిలో [illegible]పుదామరపువ్వు లున్నవఁట. అవి యెందుకు? దేవతలు తలలు పగులఁగొట్టుకొనుటకుఁ బనికివచ్చును. మూఁడుదినములనుండి నాకు ముంజెకాయల పై ధ్యానము [illegible]యునది. దారిద్ర్యదేవతకు నిలయ మైనయీవేల్పువీటియందు తాటిచెట్టే లేదు గదా? [illegible]ము తిని నీళ్ళు త్రాగి యెఱుఁగనియానిర్భాగ్యు లగుదేవతలకు తాటిపండు తినుసంతటి [illegible]ముకూడ లభించునా? ఈపట్టణస్థితిఁ జూడ నిందు వసియించువేల్పులు నాగరకత [illegible]దో యెఱుఁగని మోటపసరము లని నాకుఁ దోఁచుచున్నది. పోనీ. ఆవస్తువులు [illegible]క పోయినను మానె నామనసున నున్న తక్కిన కోరిక లైన నెఱవేఱినవా? దేవేం[illegible]నిఁ గట్టిగట్టి దండయాత్రకు వెడలు రాక్షసులందఱుఁ గావలసినంత యమృతము [illegible] చిరకాలజీవులు గావచ్చు ననియు స్వర్గలోకమునం దప్సరసలు వేనవే[illegible]గనుక యెవనికిఁ గావలసినదానిని వాఁ డతిమనసుఁ జేయిపట్టుకొని తీసికొని

పోయి సుఖింపవచ్చుననియు, సేనానాయకు లగుమురహయగ్రీవులు నొక్కి పలుకుటచే కొండంతయుత్సాహముతో నేను రంభను జేపట్టి తీసికొనిపోవచ్చు నని యిందు వచ్చితిని. కాని యమృతభాండ మంతరించినది. గడుసు లంజ రంభ యేమైనదో యెవ్వరికిని దెలియదు ; దానిజాడ దెలుపువారు నా కెవ్వరయిన గనఁబడిన బాగుండును. (అని చుట్టుఁజూచి) అదిగో మావజ్రికంఠుఁ డిటువచ్చుచున్నాఁడు. వానినడిగి తెలిసికొనియెద.

[అప్పుడు వజ్రికంఠుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

వజ్రికంఠుఁడు—(తనలో) బళి ! బళీ ! ఈనరకమహారాజుగారు చిరకాలజీవు లయి యుందురు గాక ! ఈతనియధికార మాచంద్రార్కము నిలుచు గాక ! ఈమహాత్మునివలనే గదా కుంభకర్ణులనాఁటను, తారకాసురబలిచక్రవర్తులనాఁటను లేనిగౌరవము మారాక్షసకులమునకు నేఁడు కలిగినది! కాని నరకమహారాజు మహేంద్రుని యుంపుడుకత్తె యగునూర్వశినిఁ గూడుట కయి యభిలషించుచుఁ జంద్రోదయము కాఁగానే నన్నుఁ దనకడకు గమ్మనియానతిచ్చె. ఇంతలో మందబుద్ధి యగుమందపాలునితో నించుక మాటలాడి వినోదించెదను. వాఁ డెవరికొఱకో నిరీక్షించుచున్నాఁడు. (అని ప్రకాశముగా) ఓరీ ! మందపాలా ! నీ వెవరికొఱకు వెదకులాడుచున్నావు ?

మంద—(సమీపముగా వచ్చి) ఓరీ ! వజ్రికంఠా ! నీ విప్పు డేం దలంచుచున్నావు ? నీ కెక్కడనైన రంభ యగపడలేదు గదా !

వజ్ర—ఆహా ! నా కొకయాఁడుది కనఁబడినది. అది రంభయే యై యుండవచ్చును. అయిన నది యెట్లుండునో నీ వించుక యానవాలు చెప్పినపక్షమున దానిజాడ నీకు నెఱింగింపఁగలను ?

మందపా—(సంతోషముతో) కనఁబడినదా ? వెనుక రెండుమూఁడుసార్లు దాని నేను దూరమునుండి చూచితిని. అప్పటినుండియు దానియాకృతి నామనసున నాటుకొనియే యున్నది. దాని గానవా లెఱింగించెద వినుము. అది చక్కనిచుక్క. దాని శరీరకాంతి తాటిపేశమువలెఁ బచ్చగ నుండును. దానితలవెండ్రుకలు మసిబొగ్గులో జిగింజలో ముంచుకొనవలయును. దానికొప్పు మాలకాకివలె. నప్పుడే యావములోనుండి తీసినపిడతవలె నల్లనై పెద్దదిగా నుండును. దానిజడ యనుపగిరిటెకాడలాగున నుండును. కన్ను లాలిచిప్పలు. దానిపెదవి క్రొత్తానకాయ పేముకవలె నెఱ్ఱనై యుండును. మొగ మిత్తడిసిబ్బివలె గుండ్రముగ నుండును. అది పువ్వులపావడఁ గట్టి యుల్లిపొరవంటి యుత్తరీయము వల్లెవాటు వేసికొని దొర్లుచు తారుచు సొక్కుచు సోలుచు నిక్కుచు నీల్గుచు వంగుచు పొంగుచు వాడుచు పాడుచు నడచినప్పుడు మిక్కిలి లోఁ జంద్రులాగు గజ్జెలగోడిగలాగు రామచిలుకలాగు గోరింకలాగు పికిలిపిట్టలాగు నెమలిపెంటిలాగు

ఱ్ఱిలూగు తళతళలాడుచు మిలమిలలాడుచు జలజలలాడుచు చకచకలాడుచు పక లాడుచు నచ్చెనుగ బోగముదానివలె నుండును. వేయేల? అప్పుడు దానిం జూచిన మునుల కయిన మనసు కరుఁగక మానదు. నీ కది యెక్కడఁ గనఁబడినది ?

వజ్ర—నిన్న రాత్రికలలోఁ గనఁబడినది.

మంద—(కోపముతో) నన్నెగతాళి చేయుదువా ? నీపాటుపాడిని వెయ్య ! ప్పుడు నిటుకంటిబుద్ధులే. నీనోరుమాటలాడుచున్న నీనోసలు వ్రక్కలించుచుండును. దటనుండి యు నొక్కమచ్చునవే బ్రతికినావు. నీబ్రతుకు బండలుగాను. నేనా నీకు శ్యమునకు దొరకినవాఁడను ?

వజ్ర—తాతా ! కోపగింపకుము. ఉడుతలుపీఁకిన తాటిటెంకవలె తల గలిగి మీసా గడ్డము నరసినముసలిముండకొడుకునకు నీకు రంభ గావలసివచ్చెఁగదా యని యెగ చేసితిని. కాని నీ విప్పుడు రంభవిషయమయి చేసినవర్ణనము మెచ్చదగియున్నది. మును గఁ గోరినపక్షమున రంభను గలిసికొను నుపాయముఁ జెప్పెద వినుము.

మంద—నాతండ్రీ ! నానాయనా ! చెప్పు చెప్పు. ఈయుపకారమునకు నే క జన్మమున నీయింటఁ గుక్కనై పుట్టి నీఋణముఁ దీర్చికొనియెదను. నాకుఁ మకుఁ బుట్టినపక్షమున నీ పేరు పెట్టుకొనియెదను.

వజ్ర—ఇదిగోఁ జెప్పెద వినుము. రంభ మొదలగు నచ్చరలు మనము స్వర్గ కు వచ్చినతోడనే పాఱిపోయిరి. అయినను భయము లేదు. యుద్ధములో తేఁజినవా రందఱు రంభాసంభోగము గాంతురు. అందుచే నీ వొకకత్తితోఁ పించుకొని చచ్చిపొమ్ము. అప్పుడు నీకు రంభపొత్తు గలుగును.

మంద—అదిగో ! మరల హాస్యము నారంభించినాఁడవు ; నే నడిగినదాని ఁ గోపము వచ్చినయెడల నేను మంచివాఁడను కాను. కాఁబట్టి యీ మాటను నే నడిగినదాని కుత్తరము చెప్పుము. రంభ పాఱిపోయినది సరే. ఊర్వశి కేమయిన కొంచె ముపకారము సేయునా ?

వజ్ర—ఔరా ! సెహబాసా ! నీకనుపులో నెంతయూహ లున్నవిరా ! సహా ను మోహించిన యూర్వశియే నీకుఁ గావలయునుగా ! సరే! జాగ్రత్తగా నుండుము. మహారాజుగారితోఁ జెప్పి, నీడొక్క చీలించి, పేగులు తోడించి, గుడ్లు చి, వెన్ను చీలించి, చెంపలు పగులఁగొట్టించి, బుగ్గలు సాగఁదీయించి ; పెట్టెలతో రఁగొట్టించి, మోకాళ్ళచిప్పలు తీయించి, నాలుక కోయించి, తల గొరిగించి, దమీఁద నెక్కించి, యూరేగించి కొఱతను వేయింపకపోయిన నా పేరు వజ్ర

కంటకుఁడవు గాఁడవు. మహారాజుగారి సొంతరమేమి నీయందుఁగల దేమి? తాఁతల్లి మెలఁగక మాటలాడెదవా?

మంద—(వజ్రకంఠుని కాళ్లపైఁబడి) నాతండ్రీ! నన్ను రక్షింపుము. బ నేరక నోటికివచ్చినట్లు పురమాటలు కూసితిని. మఱియొకసారి నే నిట్లు ప్రేలుదు నేని నన్ను నీచిత్తమువచ్చినశిక్ష చేయింపుము. కావలసినవాఁడవు గదా యని నీకడ్డ నిట్లంటి గాని యది తప్పైనచో మరల నందునా?

వజ్ర—సరే! నిన్ను రక్షించితిని. ఇఁకముం దెట్టిమాట లెన్నఁడు ననకుము ఇఁక నేఁ బోవలయును నన్ను విడువుము.

మంద—(లేచి) నీదయచేత నిప్పటికి గండము గడచి బ్రతికి బయటఁబడితిని. నీవిప్పు డెక్కడికిఁ బోయెదవు?

వజ్ర—నరకమహారాజుగా రూర్వశీవిరహతాపమున కోర్వక యీరాత్రి మేడ లలోఁ బువ్వులపాన్పుపైఁ బవ్వళింతురు. ఊరడించుటకు ప్రియభృత్యుఁడ నయిన నాయనప్రక్క నుండవలయును. ఎన్నివర్తమానముల నంపిన నూర్వశి మహారాజుకడ కరాలేదు. అందుచే నామెను దోడితెచ్చుటకు సేనాపతియైన నిశుంభుని మహారా జుగారు పంచినారు. ఎట్లయినఁ జంద్రోదయ మగునప్పటికి నే నక్కడ నుండవలయును.

మంద—అదిగో విబూదిపండో ముగ్గుబుట్టయో తెగినపుష్పశ్లేషమో యన్నట్లు చంద్రమండల ముదయించుచున్నది. నీ విఁక సత్వరముగ పో. నామాట నప్పటికి జ్ఞా పెట్టుకొనుమా! రంభ నీకగపడినప్పుడు నాతోఁ గొంచెము చెప్పు.

వజ్ర—వేయేండ్లు తలక్రిందుగఁ దపస్సుచేసిన రంభకు నీవంటి గసికుఁడు దొ రకఁడు. ఆమెను నీవే వెదకికొనుము. నే వెతకఁజాలను.

(అని యిద్దఱు నిష్క్రమించుచున్నారు)

ఇది విష్కంభము.

---

(అప్పుడు దేవేంద్రమందిరము ముందఱ నొక చంద్రకాంతవేదికమీఁద బువ్వులపాన్పు కూర్చుండి నరకాసురుఁడు వజ్రకంఠునితోఁ గూడి ప్రవేశించుచున్నాఁడు.)

నర—ఓరీ! వజ్రకంఠా!

చ. అదితిని నష్టదిక్పతుల నాహవభూమి నటున్న సంతసం
బొదవ నొకింత; రాజ్యరమ నూనితి నంచు మనంబునందు స
మ్మద మొదవింప దించుకయు, నుత్తమమై యొకసారి యూర్వశీ
సదయాధరామృతము సేవింపఁ గలభాగ్యము నాకు లభింప కుండుటన్,

కాంచు యెఱుఁగనిసే నిప్డు వెఱవ వలసె
నిండుసెలకును పండువెన్నెలకు సకట !

వజ్రి—కామలరోగము గలవానికి జగ మంతయుఁ బచ్చగఁ దోఁచునట్లు వ
తాపముగల మీకుఁ జల్లనివెన్నెల పీడాకరముగఁ దోఁచుచున్నదికాఁబోలు! పన్నీ
దిగినదున్న పోతువలె నే నీవెన్నెలలో హాయిగ నున్నాఁడను.

నర—ఓరీ ! నీకు బలె నా కీజాబిల్లి సుఖప్రదముగ లేదు. నేను దివ్రదివము
నందువిడసి మహేంద్రాదిదిక్పాలకుల రణరంగమున నోడించిపుచ్చి నాకమునుండి య
రులఁ బాఱఁద్రోలితి నని మనసునఁ గ్రోధము నిలిపి యమరపక్షపాతు లగుమన్మథవ
సుఁడు మొదలగువారు హాళాహాళి మెఱయ నన్నేఁచుచున్నవారు. చూడు—

సీ. మంద వీజనములు మాటిమాటికి వీచి కసి మసంగఁగఁ జొచ్చె గాలివేల్పు
చలివెలుంగుల పేరి పలుబల్లెములఁ గ్రుమ్మి సంచరింపఁగఁ జొచ్చె చందమామ
కలువరేకుల పేరి కఱకుఁగత్తులఁ జల్చి పగఁ దీర్చుకొనఁ జొచ్చె బంచశరుఁ
నవలతాంతములతో నందనమ్మునునింపి యలయింపఁగాఁ జొచ్చె నామనిదొ

అక్కటక్కట ! వీరియం దొక్కఁ డొకఁడె
జగము లొక్కొక్కకడకుఁ దేజాలు ననఁగ
దుర్మదమున నీదుష్టచతుష్టయంబు
చేర నొక్కతావున కింకఁ జెప్ప నేల ?

వజ్రి—(తనలో) ఈయన యిప్పు డూర్వశిపైఁ గలమోహముచే సను స్తము
మఱచియున్నాఁడు. వీనిమనసును మఱియొకవిషయముమీఁదికి మరలెపెదను. (ప్రకా
ముగా) దేవా ! స్వర్గలోకము జయించియు మీరు విజయఫలము ననుభవింపకున్నార
ఒక్కసారి యప్సరలయాటలం జూచి, గంధర్వులపాటలు విని, మందారపుష్పదామమ
మెడఁ దాల్చి, నందనోద్యానమున విహరించి, మేరుగిరికూటముల నెక్కి, సురదీర్ఘి
జలక్రీడఁగావించి, సుఖించి, యమరావతిని గొల్లలాడి, మాకన్నులకు విందొనరింతురు
కయని ప్రార్థించుచున్నాఁడను. అమృతకలశము కామధేనువు చింతామణీరత్న
మనపాలఁబడు నేమో యను నీసున నింద్రుఁడు వానిని మనము రాకమున్నె
ించుకొనిపోయె. ఉన్నవైనను మనసార ననుభవింపవలదే ?

నర—వజ్రికంఠా ?

తే. గీ. నందనోద్యానవన మేగ నాకు మేల ?
కామిని యేల ? మణి యేల ? కల్ప మేల ?

వజ్ర—ఈనిశుంభునకు సైన్యాధిపత్యమున నున్న సేర్పు కంటె మహారాజునకు మిండగత్తెలను దార్చుటలో నెక్కువప్రజ్ఞ యున్నట్లు కనఁబడుచున్నది. వాని నింక మీఁఁద నిట్టి యుద్యోగములో నుంచుటయే మంచిది.

నిశుం—ఓరిమూర్ఖుఁడా! వజ్రకంఠా! సింగము నాశ్రయించిన నక్కవలె రాజాశ్రయమున నీవు నిర్భయముగఁ జరించుచున్నాఁడవు. ఇప్పు డీమహారాజు మొగముఁ జూచియేసుమా నీప్రాణంబులు నీశరీరములో నే నుండనిచ్చినది.

నర—మిత్రమా ! ఈయప్రయుక్తనిమాటలు మొదటనుండియు నీ నెఱిఁగినవేకదా.

నిశుం—దేవా! వానిమాటలు నేసరకు సేయ. ఇదిగో యూర్వశి వచ్చి జంత్రపుబొమ్మవలె నిలుచున్నది. దేవర యపాంగాంచలోకనముల దీనిఁ బలుకరింపుఁడు.

నర—మిత్రుఁడా!

తే. గీ. వేయిఁగన్నుల ననయంబు వేల్పుఱేఁడు
తరుణిలావణ్యమును జూచి తనివిసనక
యున్నవాఁ డన నేఁ దృప్తి నొందఁ గలనె?
కనులు రెండింటితో నొక్కగడియ చూచి.

గౌతమశాపము మహేంద్రునకు నిజముగ నీవిషయమున వరమేయైనది. ఈవిషయమున నేను సహస్రాక్షుఁడను గాక పోవుటయు నొకలోపమె.

వజ్ర—అది యెంతభాగ్యము. ఏమునిచేనో పట్టఁజాలనిశాపము వచ్చినప్పుడు మనకంతటిభాగ్యముఁ గలుగఁజేయక పోఁడు.

నిశుం—ఊర్వశీ! కొయ్యబొమ్మవలె నిలిచియుండెద వేల? మహారాజునకు ప్రణామము.

ఊర్వ—(తనలో) కటకటా! మహేంద్రునకు వేల్పులనిండోలగంబున సేవ సేయుచేతులతో నీదానవాధమునకు మ్రొక్కవలసె. (ప్రకాశముగ) దానవేంద్రా! నమస్కారము.

నర—(తనలో) దీని నిప్పు డేమని దీవింతును? నామనసులోభావము తేటపడునట్లాశీర్వదింపవలెను. (ప్రకాశముగ) ఓత్రిభువనరత్నమా !

మ. త్రిజగన్మోహన మై, దివాంగణ మై, దేవేంద్రుని క్షేప మై,
సుజనిర్మాణముకన్నఁ ద్రౌఢతర మై, యామన్మథో ద్యజ్జయ
ధ్వజ మై, కన్నులపండువై, లలిత మై, ద్రష్టవ్య మై, చాల న
క్షజ మౌ నీ నెఱజవ్వనం బలరుత న్గళ్యాణి! యెల్లప్పుడున్.

వజ్ర—తథాస్తు.

ఊర్వ—(తనలో) ఈదురాత్ముఁ డపూర్వమైన యాశీర్వచనముచేఁ దన నింద్య స్వభావమును వెల్లడి చేయుచున్నాఁడు అయ్యో! నా కీదినమున నేనిరో నీదుష్టాఁ వ్నది.

నిశుం—ఈదీనకాంత యలిగి మీపై క్రోధ చూపులఁ బ్రసరింపఁజేయుచున్నది.

నర—అట్టియిన నామెచూపులను నేను ప్రసన్నములుగఁ జేసికొనెద. ఓలావణ్యరాశీ!

మ. చెలులై తేంట్లకు, సోగలై, నెడదలై, చెంగల్వచుట్టంబులై,
కలజాతంబుల నేలునట్టి దొరలై, సౌభాగ్యపుందీవులై,
కలుమ ల్లిమ్మడుకోవులై, కఱకులై, కందర్పవాల్గోవులై,
తెలునొప్పారెడు నీదు కన్నులకు నాశీర్వాద మ్మిజ్ఞానా!

వజ్ర—తథాస్తు.

నిశుం—ఈపలుకులంబట్టి మీరు శతమన్యునికంటె నూఱుమడుంగు లెక్కుడు వారలని యూర్వశి యిప్పుడయిన దెలిసికొనకపోదు.

వజ్ర—ఆయన నూఱుమడుంగుల రసికుఁడు. ఆయనబంటవు నీవేఁబదిరెట్లు రసికుఁడవు.

నిశుం—ఓరి! తులువా! నీపాదునోటికి బుద్ధి చెప్పుట కిది సమయము కాదు. (రాజుతో) దేవా! సురవాయగ్రిపులు నారాక నిరీక్షించుచుందురు గావున శిబిరము నకుఁ బోవ నా కానతిండు. ఊర్వశీ! లేనిపోని బోగము చేకుబ్ల్లలు చేయక ప్రసన్నురాల వయి మహారాజు ననుగ్రహము సంపాదించుకొనుము.

నర—నీమేలు నేను మఱచిపోను. నీ విఁక శిబిరమునకుఁ బొమ్ము.

నిశుం—చిత్తము. మీయంతటివారి కదియే కావలసినది. (అని నిష్క్రమించును.)

వజ్ర—(తనలో) ఇప్పుడు మారాజునకు శనిగ్రహము వదలినట్లే యున్నది.

ఊర్వ—దానవేశ్వరా! దేవరవారు నన్నుఁ బిలిపించినకారణ మేమో తెలియఁ జేయుమన్నాను.

వజ్ర—తొందరపడకు. స్వల్పకాలములోనే తెలిసికొనఁగలవు.

నర—ఓసుందరీ!

ఉ. ఇన్నెలరాలతిన్నియల నిన్నగసాన్పుల మేను జేర్చి యీ
వెన్నెలరేల నేనిటుల వేఁగుచు నున్నఁ గొఱంగి యుండుటల్
కన్నులఁ జూచియు న్నిలువఁగాఁ గత మేమని నంగనాచివై
న న్నడుగం దలంచు టిది న్యాయమె కారణ మీ వెఱుంగవే? 16

అయినను దత్కారణము నీవు నానోటనే వినఁ దలఁచుచున్న దానవు గాన నీకుఁజెప్పక పోవుట పాడికాదు. సహస్రాక్షుని గెలిచి యమరసామ్రాజ్యాధిపత్యము నేను గైకొంటెని గాని నీవు లేనిచో నిక్ పత్వము పరిపూర్ణము గాదు. స్వర్గరాజ్యలక్ష్మి నీతోఁ జిరకాలముఁ గలసి మెలసి యుండుటంజేసి తా నొంటిగ నాకడ నుండ నొల్లకున్నయది. కారణము తెలిసినదా?

వజ్ర—దేవా! దీనికి స్పష్టముగఁ విప్పిఁ చెప్పినంగాని తెలియదు.

నర—అట్లయిన నిదిగో విస్పష్టముగాఁ జెప్పుచున్నాఁడను.

తే. గీ. ఇంచువిలుకాఁడు న న్నదియే మొ కాని
యేఁచుచున్నాఁడు నెన రొక యింత లేక
సురునితోఁ జెప్పి యాపీడ మాన్పఁ గదరె
నరుఁడు వినకున్న నీవైన మాన్పఁ దగవె?

వజ్ర—ఈమాత్రపుఁగార్యమునకు నీ మెు నింత వేఁడవలయునా? నాకలోకవేశ్యలలో సార్వశి పెద్దపిన్న తారతమ్యము లెఱింగిన యోగ్యురాలు. మఱియు నిది దానిచేతిలోనున్న పనియే గనుక నీ మాట త్రోసివేయదు.

ఊర్వ—(తనలో) ఆహాహా! ఆ యజమానుని కీసేవకుఁడు దగినవాఁడె. ఈ రతిసాధముఁడు కామాయత్తుఁడయి మొదలు దెలియక యున్నవాఁడు. వీనికి నే నిప్పుడేమి యుత్తరముఁ జెప్పుదును? (అని యాలోచించుచున్నది.)

నర—(తనలో) ఇది నామాట కుత్తరమీయకున్న దేమి? (ప్రకాశముగ)

ఉ. అనుమానించెద వేల సుందరి! యహల్యాజారుఁడ న్నేను గా
ననియో, కన్నులు వేయి లే వనియొ నా, కయ్యింద్రునం దున్న తే
ల్గానము ల్నాకడఁ గానరా వనియొ, నీలోఁ జింత, నే నెట్టు లు
న్నను మీయిందుకునిపాటి సేయనఁటె? ఆ ంతా! భ్రాంతి నీ కేటికే?

ఊర్వ—దేవా! ఎదుట లేనిమహేంద్రుని దెప్పుట నిగవుకాను. వారిగుణములు మీకు రావు; మీగొనములు వారికి రావు. వారంతవారు వారు మీ యంతవారు మీరు.

వజ్ర—సరే! నాయంతవాఁడను నేను, నీయంతదానవు నీవు.

నర—ఓకళ్యాణీ! నీ కిష్టము లేదుగానువ నింక నుహేంద్రునిమాట నే నెత్తను. కాని నాప్రార్థన మంగీకరించి నాయంతిపురమునకు రమ్ము. నావలన నేభయంబును నీవు పడనక్కఱలేదు.

మ. పౌలఁతీ! కన్నులఁ గప్పుకొందుఁ బువ్వులం బూజింతు నిన్ను న్మనం
బఁటరం బట్టపుదేవిఁ జేయుదును నీయాజ్ఞం దలం దాల్తు నే

వజ్రి—మహాప్రభూ ! ఏలినవారు నిజము గ్రహించినారు.

ఊర్వ—రాక్షసేశ్వరా ! చక్కదనమున నెఱజాణతనమున నన్నుఁ బు రైకొనిన ప్రోడలు స్వర్గమర్త్యపాతాళములయందు మీకుఁ గావలసినంత యుండఁగ డో యౌవనమంతయుఁ బోయిన ప్రాఁతదానను నన్నుఁ గోరెద రేల?

వజ్రి—ఈవగలాఁడి మిమ్ములను బుట్టలోఁ బెట్టుటకుఁ బ్రయత్నించుచు జాగ్రత్త.

నర—ఏమి ! నీవు యౌవనము వెల్లిపోయిన ప్రాఁతదానవా ?

తే. గీ. పాతవడియును బంగారు వన్నె చెడునె ?
ప్రాఁతచెట్టులు తియ్యనిపండ్లు నిడవె ?
ప్రాఁతదయ్యును జాబిల్లి పసచెడియెనె ?
ప్రాఁత క్రొత్త లేమిటికి సువస్తువులకు ?

వజ్ర—పాతమానులు చేవఁదేరునట్లు నీమె ప్రాఁత గొలుచే నెక్కుడుజ గానున్నది. మఱియు ప్రాఁతవస్తువులు పథ్యములని చెప్పుదురు. కావున నీమెపా మీకుఁ బథ్యమే !

ఊర్వ—నాయందు మీకుఁ గలయనురాగాతిశయముచే మీకన్నులకట్లు నేఁ బడుచున్నదానను.

నర—కాంతా ! అట్లు గాదు.

తే. గీ. మెఱుఁగుఁదీఁగెకు వన్నెలు తెలుఁగు నేని
కలికి ! నీ మేనినిగ్గులు కర్గ వచ్చు
బుట్టతేనియలోఁ దీపుపోవు నేని
బొలఁతి! నీయందు రసికత పోవవచ్చు.

ఊర్వ—నరకమహారాజా ! జన్మమునుబట్టి నే నొకపణ్యాంగన నైనను సక గజ్జనకుఁ డగుమహేంద్రునకు వలపుగత్తెనై యుండుటంజేసి నే నట్టియోగ్యతకుఁ దయుండకపోయినను నింద్రునియందలి గౌరవమున నైన లోకమాతగాఁ బరిగణింపఁ వలసినదానను.

నర—(ఆశ్చర్యముతో) ఏమీ! నీవు లోకమాతవా !

తే. గీ. మగువ ! నీయందు నింతింతమహిమ యుంట
యింత కాలమునుండి నే నెన్నఁ డెఱుఁగఁ

వజ్ర—ఓహోహో! ఇది లోకమాతయఁట! మాకందఱకుఁ దల్లియని పైఁ బేరును గాలు! అట్లయిన నీవె మాపాలిఁటి పెద్దమ్మవయి.

ఊర్వ—అసురనాయకా! నేను లోకమాత ననుట నీకు హాస్యాస్పదముగ నున్నది. అట్లయిన నిటు విను. 'పితృసమో జ్యేష్ఠః' యను శాస్త్రవచనమును బట్టి మహేంద్రుఁడు నీ కగ్రసహోదరుఁ డగుటచే నే మీకు వదినెనైతిని. మోహా మెంతటివారి నైన దలఁపవలదా?

వజ్రి—ఇష్టము లేనప్పుడు కులటలు వావివరుసలు వెదకుదురు.

నర—ఓహో! ఇప్పుడు నీకు వావివరుసలు గావలసివచ్చెనవా? నీపూర్వ చరితము నొక దలఁచుకొనుము. కాదుకాదు. నేనే జ్ఞప్తికిఁ దెచ్చెద వినుము.

చ. నెలఁతరో! యేమి కావలయు నీ కలపాండవమధ్యముండు, నీ
గళమునఁ దాళిగట్టిన మగండతెనిషుఁ బురూరవుండు, నీ
చెలియగునట్టి మేనకకుఁ జేరుచు చుట్టమె గాధిపట్టి; వా
వులఁ వెనకం బిలం చెదవు బోగముబోటికి వావులేటికే? 27

ఊర్వ—(తనలో) ఇతఁడు నాప్రాంతతప్పు లన్నియుఁ బయలఁబెట్టుచున్నాఁడు కొఱవంకఁ జెప్పుదును?

వజ్ర—సూదికోఁటకు సోదికిఁబోవఁ బ్రాంతఱంకులు బైటఁబడినవఁట! ఈతని భయమగుచున్నది.

ఊర్వ—రాజా! నే నెవ్వతెనైనను నీకుఁ బరకాంతనుగదా!

నర—పరకాంత వెట్లగుదువు? వేశ్యవగుటచే నందఱకు సామాన్యకాంతవు.

తే. గీ. ఎవఁడు ధన మిచ్చు మీకు వాఁడె మగఁ డంచు
బ్రహ్మ మూఁడుబంతులఁ దీర్చి వ్రాసె నుదుట
గడునుపోకడ లిఁకఁ జాలుఁ గట్టిపెట్టు
సకియ! నీ యాట లిచ్చట సాగిరావు. 28

ఊర్వ—అనురాగము లేనియబలను బలిమిం బట్టఁజూచుట యధర్మము కాదా?

నర—ఏమి! మా కిప్పుడు ధర్మోపన్యాసములు సేయవచ్చితివా?

చ. జిలిబిలితేనెపల్కులును జెన్నగుతళ్కులు వాలుచూపులున్
దెలివపుఁగోపులున్ రకపుఁజన్నులు వన్నెలు పెన్వగల్ గల్
నిలుకడలేని హాసములు నింద్యపువేసములు న్ధరించి లో
కులఁ బడఁద్రోయు వేశ్య లిటఁ గ్రొత్తగ నేర్చిరె కొన్ని ధర్మముల్. 29

కను,

తే. గీ. దనుజులము మేము మాకేల ధర్మమేల ?
వావి వరుసల నెన్నెడువారు వేరు
వేల్పు లెవరైన నిమఁ గోరి పిలుతు రని
వారికడఁ జెప్పు మీనీతివర్తనములు.

వజ్ర—తొండముదిరి యూసరవెల్లి యయినట్లు పాంసులకులటలు పతివ్రత లగుదురు గాఁబోలు !

ఊర్వ—(కోపముతో) ఓరాక్షసరాజా ! మేము వేశ్యలమైనను పతివ్రతలమే సుమా !

నర—పతియున్నప్పుడేగదా పతివ్రత యగుట ; పతియే లేనిదానిమాట యేమి ?

ఊర్వ—దివస్పతియే నాపతి.

నర—ఈదివస్పతి కట్టు నీవిడిచిన యందఱికో పతివ్రతవైతివి. అట్లే నన్నుం బతిఁగాఁ జేసికొని నాకునుం బతివ్రత వగుము.

వజ్ర—ఊర్వశీ! నీవెట్టిపతివ్రతవో యీయనయును నట్టియేకపత్నీవ్రతస్థుఁడు. వాయనను జేపట్టితివేని మీకనురూపదాంపత్య మగును.

నర—మఱియు భుజబలంబున వేల్పులం గెలిచి నే నిప్పుడు దివస్పతి నైతిని. నీవు మాటనిలుకడ గలదానవై దివస్పతినైన నన్నుం జేపట్టుము. నీవు నాయెడఁ బ్రసన్నురాలవగుదువేని సకలలోకకళ్యాణంబగు. కానేని నాకు రాజ్యలక్ష్మిం గైకొన్న చందంబున నిన్నుం బలిమిఁ గైకొనవలసివచ్చు.

ఊర్వ—(తనలో) ఈదురాత్ముఁడు నామానభంగంబు చేయఁ గృతనిశ్చయుఁడై యున్నవాఁడు. మలినవస్త్రమును మాలిన్యముచేతనే శుద్ధిఁ జేయునట్లు దురాత్ముని కపటోపాయములచేత నిర్జించుట యుచితము !

వజ్ర—ఓవెఱ్ఱిదానా! ఊర్వశీ ! ఈమహారాజు మిక్కిలి మంచివాఁడు. చెడఁగొట్టుకొనక యీయనప్రాపకము సంపాదించుకొని సుఖపడుము.

ఊర్వ—దేవా! ఈవఱకు నాపలికినపరుషోక్తులకు నన్ను క్షమియింపవలయును. నే నెప్పటికైన మీదాననే.

నర—(సంతోషముతో) ఓభువనైకసుందరీ !

తే. గీ. నిన్ను క్షమియింప నేటికి నీపలుకులు
చాలఁ గఠినంబు లయ్యును జల్ల నగుచుఁ
బరమసుఖ మిచ్చె వడగండ్లపగిది నొప్పి
భువనసంతప్తమైన నామదికి నబల!

వుటచే నన్నంతలో సరిపెట్టుకొనుట మంచిదని యింద్రునియందనుండి గౌరవము గాలము గడపు చుంటిని. ఇంక నేను నీధనము. నీవే నాప్రాణనాథవు.

నర—ధన్యోస్మి! ధన్యోస్మి! నే నిప్పుడు నిజముగా నింద్రుఁడ నైతిని.

చ. నిజముఁగ నీదుపల్కు నను నీబిగికౌఁగిటఁ జేర్పుదోక్క యం
గజపరితాపము ల్దొలఁగుకాలము వచ్చెనె నాకు నాదు ది
గ్విజయము సార్థకం బగునె కీర్తి వెలుంగునె యింక నీముఖాం
బుజమును ముద్దులాడుటకుఁ బున్నెముఁ జేసితి నే? తలోదరీ!

వ్రజ—మీరే కాదు నేనును నాపితృదేవతలును పదునాల్గుతరములవఱకు దరించితిమి.

నర—దేవీ! నందనోద్యానమునకుం బోయి విహరింతము రమ్ము.

ఊర్వ—దేవా! నా కొక్క ప్రతిన యున్నది. ఆప్రతిన చెల్లించి నన్నుం జేపట్టవలయు.

నర—నీప్రతినఁ బాలించుటకయి నీసేవకుఁడు సిద్ధముగనున్నవాఁడు. ఆనతిమ్ము.

ఊర్వ—మీరు పాకశాసనుని గెల్చి మహేంద్రపదవి నాక్రమించుకొంటిరి కాని బ్రాహ్మణులు మహర్షులు సేయు యజ్ఞములలో హవిర్భాగములు గైకొన్నప్పుడు కాని దేవేంద్రత్వము సార్థకముగాదు. అప్పుడు నే నిన్ను వరింతు. ఇప్పుడు బదరీవనమున సత్రయాగము జరుగుచున్నయది. అక్కడకు బోయి ఋషుల నొప్పించి హవిర్భాగముల భుజించి రమ్ము.

నర—(నవ్వుచు) ఇదియా నీప్రతిన! సరిసరి. ఇది చెల్లించు టెంతసేపు. ఇంతకన్న మఱియేదియు లేదుగదా! అట్లు చేసినపిదప మఱియొకవంకఁ జెప్పవుగద!

ఊర్వ—మఱియొకవంకయుఁ జెప్పను. మాటఁ దప్పితి నేని మిమ్ము నానపెట్టుకొన్నట్లే. ఇంక నాకు వెలపండు. నేను బోయి మీరాక నిరీక్షించుచుందును.

నర—దేవీ! అట్లే పొమ్ము. నేనునీదాసుఁడ ననుమాట మనసులో నుంచుకొనుము.

ఊర్వ—(తనలో) ఇప్పటికిఁ బులినోటికిఁ జిక్కకుండ తప్పించుకొంటిని. ఈబుద్ధిహీనుఁడీగండము గడచి బ్రతికినప్పటిమాటగదా! మీఁద దైవమున్నాఁడు. (అని నిష్క్రమించును)

వ్రజ—(తనలో) ఈగడుసుబోనిసకూఁతు రేదో యొక చెప్పి యీసుందరాంగుని కన్నులలో దుమ్ముకొట్టిపోయినది. ఇంక వీనికి నీమె యెక్కడనప్పటిమాటకదా!

నర—వ్రజకంఠా! నురనిశుంభాదిసైన్యాధిపతులయొద్దకుఁ బోయి దానవసైనికులు బదరికాశ్రమమునకుఁ బోవలయునుగాన ప్రయాణసన్నాహము సేయుమని చెప్పుము

వజ్రి—చిత్తము. (అని కొంచెము నడచి) దేవా ! ఎందుకో మురుఁడిటనే వచ్చు న్నాఁడు. వీని మొగము సంతోషమును సూచించుచున్నది.

[అప్పుడు మురుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

మురు—దేవా ! విజయమగుఁగాక !

నర—మురుఁడా ! మీస్వామిభక్తియు బాహుబలమును మాకు విజయకారణము య్యెను.

మురు—దేవా ! నే నిప్పుడు కావించిన మహాసాహసమును మీకు విన్నవింప చ్చితిని.

వజ్రి—ఈమహాసాహస మేదో వినఁదగినదే.

నర—నీసాహసమును వినిపించి మావీనులకు విందు సేయుము.

మురు—దేవా ! చిత్తగింపుము.

ఆ. వె. అసురమాత యైనయదితిదేవిని జేరి
 యామెకుండలముల నపహరించి
 తెచ్చినాఁడ నిపుడు దేవరవారికి
 నర్పణంబు సేయ నధికభక్తి.

ఇదిగో రత్నకుండలములు (అని యిచ్చుచున్నాఁడు.)

నర—నీసాహసము సంస్తవనీయ మయినది. నీపేరు విన్న నిర్జరాంగనలకు గర్భ చ్ఛేదక మగుఁగాక ! ఈకుండలము లూర్వశికి సమర్పించెదను.

వజ్రి—ఆఱునెలలు సాముచేసి మూలనున్న ముసలిముండను గొట్టినట్లు ముది చేఁ గదలలేక భయముచే సగము చచ్చి యొకమూల నొదిగియున్న వేల్పుటవ్వను చివచ్చితివా ? నీవంటిధైర్యవంతుఁడు దేవరాక్షసులలో నెచ్చటను లేఁడు.

మురు—ఓరినాచాటా ! నీవు రాజుగారి విదూషకుఁడ వగుటచే నిప్పుడు బ్రతికి తివి.

నర—మురుఁడా ! మనవజ్రికంఠునిమాటలు పాటింపనక్కరలేదు. యాగహవిర్భా గలు గ్రహింపకున్న నాకింద్రత్వము సిద్ధింపదు కావున సేనాసమేతులరై మీరిప్పుడు శికాశ్రమమునకుం బోయి యచ్చటితాపసుల నడిగి నయమున భయమున వారి ప్పించి హవ్యంబులఁ గొనవలయు. సేనలకుఁ బ్రయాణముఁ జాటఁబంపుము.

మురు—(సందేహముతో) మహర్షులు మనకు హవిర్భాగముల నిచ్చుటకు సమ్మ తురో లేరో.

వ్రజ—నేను నపుంసకునివంటివాఁడ నని మీ రనుకొన్నను సరేగాని సమ్మతింతు మాట నిజము.

నర—(కోపముతో) ఏమేమీ? చతుర్దశభువనైకవీరుఁడును దృణీకృతపురం దరాదిదిక్పాలకుఁడును విజయలక్ష్మీకరుణాపాంగవిలోకనప్రవర్ధితమహావిభవుండును నగు నరకాసురేంద్రునిమాట వారు నిరాకరింతురా?

ఉ. దక్కునె యింక ప్రాణములు తాపసవర్యుల కెల్ల, మానవు
ల్దక్కునె నేలవేల్పులకు దైవతకోటికి, యాగభాగముల్
గ్రక్కున నిల్చినన్సరియె కావగ మొందెడి యొసంగ కుండినన్
వ్రక్కలు చేసెదన్ దలలు భస్మముఁ జేసెద నాశ్రమంబులన్. 3

మఱియు నచ్చటి మునులు మనపలుకుఁ ద్రోసిపుచ్చిన వారితో ని ట్లనుము.

మహాస్రగ్ధర. సవనంబు ల్సాగ వింక న్జపములు తపముల్ స్నానముల్ సెల్ల వింకన్
భువనంబు ల్నిల్వ వింక న్వాదలు టరిది గో భూసురవ్రాత మింకన్
దివిజుల్ మర్త్యుల్ భుజంగుల్ స్థిరమతులయి వర్ధిల్లఁగాఁ జాల రింకన్
రవియు న్జంద్రుండుఁ జుక్కల్ గ్రహములు గతి వక్రత్వమున్ గాంతు రింకన్

వ్రజ—మాకింక చేతినిండ పనిగలిగినది.

ముని—చిత్తము. అప్పటికిని మహాత్ములు మీరాన తిరస్కరించిన మాయిష్ట వచ్చిన తెఱంగున మేము సేయవచ్చునా?

నర—ఆహా త్రికరణశుద్ధిగా.

తే. గీ. చెలఁగి యిచ్చ వచ్చినగతిఁ జేయవచ్చు
నచటి కెవఁడు వచ్చునో చూతు సడ్డగింపఁ
బరమున మగంటిమిఁ జూపి వస యడంతు
నబ్జభవు డైన నాతని యబ్బ యైన. 4

సైన్యంబులఁ దోడ్కొని మీరందఱు బదరికాశ్రమమునకుఁ బొండు. నేను బ్రాగ్జ్యోతిషపురంబున కరిగి యచటనుండి కొలఁదికాలమున్న బదరికావనంబునకు వచ్చువాఁడ. హయగ్రీవుఁ డింద్రలోకమును నాకుఁ బ్రతినిధియయి యేలుగాక! మన మింకఁ బోవుదము.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

పరుఁ డెవఁడైన దేవేంద్రపదముఁ బడయఁ
దపము సేయుచు నుండునా తగవుమాలి.

సత్య—దేవా ! అమరరక్షణముఁ జేయుటకుఁ గంకణముఁ గట్టుకొని మీ రుండ నేదైనను మహేంద్రునకు భయములేదు. అదిగో ! దేవలుఁడు మాణిభద్రుని వెంటఁబెట్టుకొని వచ్చుచున్నాఁడు. కారణ మిప్పుడే తెలిసికొనఁగలము.

(అప్పుడు దేవలుఁడు మాణిభద్రుఁడు ప్రవేశించుచున్నారు.)

దేవ—అయ్యా ! మాణిభద్రా ! అదిగో భగవంతుఁడు. ఇంక నీగోడవలు చెప్ప మొదలు పెట్టుము.

మాణి—మంచిది. (తనలో) ఇంద్రనీలమణి రోచులు వెదజల్లు నీతనిమూ యింద్రసౌందర్యమును వెల్లడించుచున్నది గదా !

మ. పగసె దైత్యులు, గాటమౌ వలపుచేఁ బాసెం బ్రత్యేకుణల్
వగచే నార్తులు, జ్ఞానవైభవముచే బ్రహ్మర్షులే తేజముల్
దగ సేవించి ముముక్షు లయ్యెదరో బంధంబు ల్పెంబాయ నా
భగవంతుం డగు దేవకీసుతుని నాభాగ్యంబునం గాంచితిన్.

దేవ—దేవా ! ఇతఁడే దేవదూత. నే నిఁక పోయి ద్వారముకడ నుండెద. (పోవును.)

మాణి—త్రివిక్రమున కభివాదనము సేయుచున్నాఁడను.

కృష్ణ—మహేంద్రదూతకు స్వాగతము.

సత్య—దివ్యపురుషదర్శనముచేఁ గృతార్థుల మైతిమి.

కృష్ణ—మాణిభద్రా ! నిర్జరకోటికి భద్రమా ?

మాణి—ఉపేంద్రా ?

తే. గీ. తెలిసి యడిగెద వనఁజాలఁ దెలిసియున్న
మరల నానోట వినఁగోరి వెలుఁగనట్లు
తెలియ కడిగెద వనఁజాలఁ దెలియకున్నె
సర్వ మెఱిఁగిన నీ కిట్టిస్వల్పవార్త.

కృష్ణ—(ఆశ్చర్యముతో) ఏమిది యిట్లనుచున్నాఁడవు. సపరివారముగ బి[illegible]నకుఁ గుశలమా ?

సత్య—నిర్జరాంగనలతోఁ గలిసి యింద్రాణి కుశలముగ నున్నదా ?

మాణి—విన్నవించుచున్నాఁడను.

జగము లన్నియు వెలిఁగించు చండకరుఁడు
చిన్నమబ్బులచేత సంఛన్నుఁ డగును. 1

మాణి—అంత మహాతేజస్వి కింత పరాజయము కలుగఁ దగినది కాదు.

కృష్ణు—ఓయీ! తేజశ్శాలుల కేగదా జయాపజయములు కలుగుట. చూడు,

తే. గీ. న్యూనతయు గౌరవంబు మహోన్నతుల కె
గాక నీచుల కెబ్భంగిఁ గలుగవచ్చు?
సలక్షుతేజులౌ సూర్యచంద్రులకె గాక
గ్రహణ ముండునె మింటిచుక్కలకు నెల్ల? 2

మాణి—దేవా! మీసమాశ్వాసంబున నాహృదయతాపము దీఱినది. మహేంద్రుఁడు మీకు విన్నవింపు మన్న సందేశము వినుఁడు.

కృష్ణు—సావధానుఁడ నయి యున్నాఁడను.

సత్య—ఆపత్సమయమునఁ బంపిన యీసందేశము జాలిగ నుండకపోదు.

మాణి—దేవా! నా చెప్పఁబోవునవి మహేంద్రవాక్యములు.

సీ. కాళీయఫణిఫణాగ్రములఁ గాండవమాడు నడుగుఁదమ్ములకు జోహారులనుము
అదితికశ్యపులకు నవతరించినవాఁడు మా కొనర్చినమేలు మఱవమనుము
అమరసంతతి యిట్టులగ చాట్లుపడుచుండ నొరునికై వడిఁజూచు టొప్పదనుము
ఈతెఱంగునఁ జేయ లాఁతివారమె మేము చాలకాలము నాఁటి సఖులమనుము
అలుబిడ్డలదెసఁ జూచి యమరవిభుఁడు
వేయుఁగన్నుల బాష్పము ల్విడిచె ననుము
అసురఁగడతేర్చుపని తన కలఁతి యనుము
దైవహితమౌ మాట నీయది తప్ప దనుము.

సత్య—ఈసందేశము విన్నపిదప జాతిగుండెలయిన కరఁగి జాలినొందును.

కృష్ణు—అన్నన్నా! ఎంతమాట. నిరుపమానమహిమాఢ్యుఁడును నిర్జరలోకసామ్రాజ్యుఁడును శూరశిఖామణియు నగుశతక్రతుఁ డిట్లు దీనోక్తులం బలుకవలసెనే? సేవకునకు నా కింత వినయపూర్వకముగ ననవి సంపవలయునే? మాణిభద్రా! నీ మహేంద్రునితో ని ట్లని విన్నవింపుము.

సీ. ఋజుమార్గపరులౌట బృందారకుల కెందు దేవకీసుతుఁడు విధేయుఁడనుము
పదునాల్గుజగముల పాలుపత్తెముఁబూను నింద్రునానతి మౌళి నిడిదు ననుము
తనయనుగ్రహమున్న దనుజవీరులనాజి నిగ్రహించుట యొక్క నిముసమనుము
నిర్నిమిత్తంబున నిరపరాధుల నేఁచు పాపకర్ములు నింక బ్రతుక ననుము

కృష్ణ— లోకసంబంధములేని యీ తపోధనులిటకు రాఁగారణ మేమిచెప్పుమ వీరి కేదుర్జనులవలన నేని భయము కలిగియుండెదుగదా !

మ. మనుచుం గానలఁ జెట్లనీడలను, జర్మంబుల్ మెయిం దాల్చుచుం,
దినుచుం దుంపలు కాయఁగూరలు, నదీనీరంబులం ద్రావుచుఁ
మనమం దెప్పుడు నీశ్వరుం దలఁచుచు, శౌర్మనంబుతో శాంతతన్
జనము ల్వచ్చెడు నీయలౌకికుల, నేనీచుండు బాధించెనో ? 2

సత్య— ఈమహాత్ములును రాక్షస బాధితులే యని నేఁ దలంచెద.

[అప్పుడు పులహాబృహదశ్వు లనుమహర్షులతో దేవుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

దేవ— మునులారా ! అదిగో వాసుదేవుడు. పనులన్ని మానుకొని మిమ్మి యెదురు చూచుచున్నాఁడు. దర్శనము చేసికొనుఁడు.

పుల— (కృష్ణునిఁజూచి) బృహదశ్వా! ప్రాకృతప్రస్తావమునఁ దలఁపించు నీమూర్తిం గనుఁగొంటివా ?

బృహ— పులహా! మాఁగినరేగుఁబండ్లు తినమరగి బదరికావనమును బాసిపోవతే తొల్లి మనలం గలసిమెలసి చరించిన నాఁటి నారాయణుని దివ్యమూర్తియే యిది.

పుల— ఔనౌను.

సీ. పదేఁటిఁ బాయగలేక పాలసంద్రమునందు నిల్లుకట్టుకొన్న యల్లుఁ డితఁడు
బృహ— మొసలికోఱలఁ జిక్కి పసదూలి పలవించు సింధురేంద్రునిప్రాణబంధు వితఁడు
పుల— ఏడువార్ధులనీళు లేకంబ యగునాఁడు మఱ్ఱియాకున నున్నకుఱ్ఱఁ డితఁడు
బృహ— భువనకంటకు లైనపాలసుబిండులఁ బట్టి మట్టుపెట్టిన జగజెట్టి యితఁడు
పుల— మీనమీతఁడు తామేటిమేటి యితఁడు
పోత్రి యీతఁడు నరసింహమూర్తి యితఁడు
బృహ— పుట్టుబుద్ధులు గలపొట్టిప్రోడ యితఁడు
చూడఁజూడ వీనులపాలి చుట్ట మితఁడు.

దేవ— (కృష్ణునితో) దేవా! వీరే పులహాబృహదశ్వు లనుమహామునులు. నే నింక ద్వారముకడ నుండెద. (అనిపోవును.)

ఋషులు— విజయతాం విజయతాం దానవకురంగకంఠీరవ!

కృ— మహర్షుల కభివాదనము సేయుచున్నాఁడను.

ఋషు— అనవరోర్ధంపతోభ్యుదయోస్తు.

కృ— మీరాసీనులమీఁద నాసీనులుగండు. (ఋషులు కూర్చుండుదురు.)

సత్య—(మెల్లగా) ప్రాణేశ్వరా ! మహర్షులు ఖిన్నులై కనఁబడుచున్నారు. కేమ నడుగఁదగును.

కృష్ణ—దేవీ ! నాకు నట్లే కనఁబడుచున్నారు. (ఋషులతో) మహాత్ములారా! ఫలాపేక్ష పరిత్యజించి పరమేశ్వర ప్రీత్యర్థము జగదభ్యుదయము నిమిత్తము మీరు గావించు తపస్సులు నిర్విఘ్నములుగ సాగుచున్నవా ?

పుల—ఈశకటకు సాగుచున్నవి.

ఉ. ఎన్నఁటిమాటలో యడిగెదవి విటు, మాఁబడగవనంబులో
నిన్నడుమం బ్రవర్తిల్లిన వెల్ల నెఱుంగవు గాక ; ధర్మయుల్
జన్నములుం దపస్సులును జన్నవి మొన్న టితోనె, యింతగా
నున్నది నీజగద్భరణ మోనలి నేతుణ! యిన్ని నాళ్ళకున్. 23

బృహ—ఇంక జగదభ్యుదయమునకు లోప ముండదు. ఏమనిన, .

తే. గీ. ఇంద్రుఁ డైనవాఁ డిపుడు దైత్యేంద్రుఁ డొకఁడు
వాని వాహినీపతులు దిక్పతులు గాఁగఁ
బ్రబలమద్యకర్మములు ధర్మములు గాఁగఁ
బిశితభోజనుల్ మునులుగా వృష్టినిలక. 24

కృష్ణ—అయ్యా! మీరును నరకబాధితులైతిరా యేమి?

పుల—దేవా! నీవు లెస్సగ గ్రహించితివి. మేము బ్రతికియుండియు భూలోకమున నరకబాధ ననుభవించుచున్నాము.

బృహ—ఇది పుణ్యాత్ములే యనుభవించు యపూర్వనరకబాధసుమా !

సత్య—ప్రాణేశ్వరా ! ఏజోలికిరాని పరమవైదికుల కైనయిన నాదుర్జనులవలని గలుగదయ్యెఁ గాఁబోలు!

కృష్ణ—కళ్యాణీ! క్రూరు లుచితానుచితముల నెఱుఁగరు కదా!

తే. గీ. కాననంబున నేఁగినకారుచిచ్చు
వేములను గాల్చి మామిళ్ళ విడిచి చనునె?
మృగయునకుఁ బెద్దపులి యెంతొ మేకమునంతె
దుష్టులకు సాధువులు నసాధువులు నొకటె. 25

ఓమహాత్ములారా! నరకుఁడు మీపై కేల రావలసివచ్చె ?

పుల—దేవా ! తత్కారణమును మే మానుపూర్విగ నెఱుఁగముగాని కర్ణాకర్ణిని యున్నారము. మాదురదృష్టము మూర్తిఁగైకొన్నదో యన్నట్లు త్రిగిరమున నాగర్వి ను నొకభోగము డి కలఁడట !

కృష్ణ—అవును. పూర్వ మన్వంతరమందు గోపముచే నారాయణఋషి యామెను సృజించెను.

సత్య—ఏమి! ఋషియే సృజించెనా? పద్మగర్భుఁడు కాఁడా?

పుల—అమ్మా! ఇట్టియపూర్వకార్యములు మహర్షులుగాక యెవరు చేయుదురు?

బృహ—ఒక్క మహర్షులే కాదు. బ్రహ్మయు నట్టివాఁడు.

తే. గీ. ఊరకయె పెక్కుకల్పంబు లుండియుండ
వెఱ్ఱిబ్రహ్మ తా నొకదైత్యవిభు సృజింప
వానిచే నగటార్చ భువనముల్ పల్లటిల్లు
మునుపటినుండియును నిదె మచ్చు మొదటివేల్పు. 2

పుల—దేవా! అవధరింపుము. ఆదురాత్ముఁడు స్వర్గము జయించి, యింద్రుఁ బారఁదోలి, యమోఘశక్తిని పిన కుంపుడుకు త్రెగ నుండుమని ప్రార్థించెనఁట! అదియు మునుల యాగముల హవిర్భాగములు గ్రహించి యింద్రత్వసిద్ధిఁ జేకొన్నపిమ్మట వానిని వరింతునని పలికెనఁట! అది విని దుష్టదానవులు మాయాశ్రమములకు వచ్చి దానవేంద్రునకు హవిర్భాగములు తేవలెనని నిర్బంధించి యడిగిరి.

బృహ—సాంగ్రామికశస్త్రవేత్తలై యాయుధపాణు లయినవీరులే వానియెదుట నిలువలేకపోవ నాయుధములులేక దండకమండలు కృష్ణాజినదర్భాసనాదులగు నిర్ధకసాధనములు గల మావంటి పరమవైదికు లేమి చేయుదురు?

కృష్ణ—అప్పుడేమైనది? మీరు హవిర్భాగముల నిచ్చుటకు సమ్మతించిరా!

పుల—పాపము శమించుఁగాక! పాపము శమించుఁగాక! మాధవా! మేమంత పరమఘాందసులమయినను మహాపాతకు లగుదానవాధములకు హవిర్భాగము లిత్తుమా? అది స్వప్నవార్త. వారితో నప్పుడే నిట్లంటిమి.

క. నెత్తుర ద్రావిన ద్రావుఁడు
కుత్తుక గోసినను బట్టి కోయుఁడు మీకే
మిత్తుమొకో హవిర్భాగము
తొత్తుకొడుకులార! వేల్పుదొర కిడ కుండన్.

సత్య—మునుల ధైర్యము మెచ్చఁదగినది.

కృష్ణ—అప్పుడు వారలు విమ్మము చేసిరో మే మూహించుకొనవచ్చును.

బృహ—మాదీనచరిత్రము మానోట నే వినుడు.

సీ. మొగము నెత్తుర గ్రమ్మ నెగగుంజి దిగగుంజి బిరుసుగడ్డము లూడఁబెఱికిరి నా
వేలు పున్నెజడల్ కేలఁదోయిని బాని హుమ్మని యుయ్యాల లూఁగినారు

ఆజ్యమంతయుఁ ద్రావి యగ్నిహోత్రములార్పి హోమకుండంబుల నుమిసినారు
పాలిపోవఁగ నీక నోరు బ్రిద్దలు చేసి కుక్కమాంసము నోటఁ గుక్కినారు
చెట్టాలకు రెక్కలు విఱిచికట్టినారు
చింతబరికెలతో వెన్నుఁ జెండినారు
నారగోచులు దిగలాగి నవ్వినారు
కూళలగుచు రక్కసిముండకొడుకు లనఘ ! 28

కృష్ణ—కటకటా ! అప్పుడు దేవబ్రాహ్మణులకు మహత్తరమైనచిత్తక్షోభము కలిగియుండును.

సత్య—ఆహాహా ! ఋషు లెంతదయామయులో చూడుఁడు. అప్పటికైయినను దుష్టదానవులను శపింపరైరి.

పుల—అమ్మా ! శపింపకపోవుటకు మాదయ కారణము గాదు.

క. శాపం బిచ్చుట కైనను
శాపోదకములు గ్రహించి చల్లుట కైనన్
గోపించుట కైనను మా
కోపిక లేదయ్యె చేష్ట లుడిగినకతనన్. 29

కృష్ణ—అనంతర మేమి జరిగినది ?

బృహ—అప్పు డప్పాలనుదిండులు కొండముచ్చులమచ్చున పెచ్చు పెఱిఁగి యాశ్రమమహీరుహంబుల నిర్మూలించియుఁ గెంపుదువ్వగములఁ జంపియు ఋషిస్త్రీలఁ జెఱఁ బట్టియు కమండలంబులఁ దుత్తునియలు గావించియు నాషాఢదండంబులు విఱిచియు మొలత్రాడుల నన్నిదంబులఁ ద్రెంచియుఁ బర్ణశాలలు భగ్నపటలంబు గావించియు వర్ణింపరాని క్రౌర్యంబుల నెఱపిరి.

పుల—తే. గీ. నా కమండలు వట్లు భిన్నంబు లగునె
యాదురాత్ములతల లెన్నఁడైన కృష్ణ !
బృహ— యాశ్రమమహీరుహము లట్లు లా పాతకులు
దుంపతెగి యెన్నఁడైన పోదురె ? ముకుంద !

కృష్ణ—బ్రాహ్మణులవంటి మీపలుకు లసత్యములు గావు. వారట్లే నశింతురు.

సత్య—వీరుపడిన యాలజడి వీరిమాటలం దెలియవచ్చు.

పుల—ఓ యమరపతిసుపాతి ! వాని నాశనము నీవే చేయవలెను. ఏలయన,

తే. గీ. కూలివలనఁ గా దిది తమ్మిచూలివలనఁ
గాదు మఱి యెవ్వరివలనఁ గాదు సుమ్ము

సరకు మూర్ఖంబు ధరఁ ద్రెళ్ళ నణుకఁబడును
నరగ నీచేత నీసుదర్శనముచేత.

బృహ—దేవా! ఈవిషయమున నిన్నుం బురికొల్పుటకు మేము కనుగొంచుంచున్నాము. ఏమన,

క. నీకొడుకుఁటు యాదనుజుఁడు
నీకొడుకే యిట్లు సేయ నిలుచునె జగముల్

పుల—నీ కొందు కూరకుండుము
యాకీర్త్యపకీర్తు లింక నతనివె కావా?

కృష్ణ—లోకాపకారులు సుతులయినను వధ్యులే.

సత్య—భగవంతుఁడుదక్షుఁ డగున్యు లట్లు పలుకఁ దగదు.

పుల—ఓయదుపుంగవా! ఇంక వేయుమాట లేల?

తే. గీ. వైదికము లైనకర్మముల్ వల దటంచుఁ
జెప్పి మాచేత మానిపించినను సరియె

బృహ—పుత్రవాత్సల్యమును ద్రోసిపుచ్చి వేగ
చెనఁటి యసురగను సంహరించినను సరియె.

కృష్ణ—అట్లయిన నోతాపసులారా! ఇటు వినుండు. ఆడురాత్ముఁడు

మ. ధరణీగర్భము దూఱనీ, పఱచి పాతాళంబునన్ దాఁగనీ,
శరధిన్ మున్గి యడంగనీ భువనముల్ సంక్షోభముల్ బొందఁగా
పరమున్ దుర్మద సంగరస్థలవిఘూర్ణచ్చక్రధారాహతిన్
మగలన్ వైదికమార్గముల్ నిలిపి ధర్మంబున్ బ్రతిష్ఠించెదన్.

ఋషులు—తథాస్తు. తథాస్తు. తథాస్తు (అని చేతులెత్తి)

శ్లోకము. జయతుజయతు దేవో దేవకీగర్భజాతో
జయతుజయతుచక్రం నిర్గళద్దైత్యచక్రం
జయతుజయతు వేద శ్శాశ్వతానందనాదో
జయతుజయతుధర్మో వైదికోత్తప్రమేశాం.

కృష్ణ—మహర్షుల యాశీర్వచనము లమోఘములయి జయప్రదము లగుగాక.

సత్య—మహర్షులు సంకల్పసిద్ధు లగుట మీ రెఱుఁగరా?

పుల—మధుసూదనా! కుమారుండు నాగకుని, సూర్యటిపుగదైత్యులను, పిల్చి మార్చి జయంబు వడసిన తెఱంగున నీవును నాకుఁ జెప్పెదవు. కాని నీవు కడుఁజూరుఁడవై కొలఁగవలయునుసుమా; వాఁడసాధారణ తేజోదుర్నిరీక్షుండు, దుర్జ

ర్వులనిర్జరేశ్వరుఁడు. వీనిమరణవార్త చెప్పఁడు వింటిమా యని నేము మాచెవులు
క్కఁబెట్టుకొని యుంటిమి.

బృహ—దేవా! నేను నించుక చెప్పఁదలఁచుచున్నాఁడను. అవధరింపుము.

చ. కుటిలుని సోమకాసురునిఁ గూల్చుట కూల్చుటగాదు సూ, మహా
కిటి వయి హేమలోచనుని గెల్చుట గెల్చుట గాదు, సాహసో
ద్భటు బలి భూతలంబునకుఁ బంచుట పంచుట గాదు, శౌర్యలం
ఘటునరకాసురుం బిలుకు మార్చుట మార్చుట గాక యచ్యుతా! 30

కృష్ణ—మహర్షులారా! మాశౌర్యబలంబునకు మీయాశీఃఫలంబు సాయమై వానికి
మరణ మాపాదించు.

ఋల—అట్లయిన మేమింక నాశ్రమంబులకుఁ బోయి భయవిహ్వలులగు తక్కిన
మునుల కీశుభవార్త నెఱిఁగించెదము.

కృష్ణ—ఓయీ! ఎవ డక్కడ?

దేవ—(ప్రవేశించి) దేవా? ఇదిగో వచ్చితి నాజ్ఞాపింపుము.

కృష్ణ—దేవలా! ఈమహర్షులను సాగనంపుము.

దేవ—చిత్తము (అని తనలో) మఱ్ఱియూడలవలె జడలుపిచ్చికగూండ్లవలె జుట్లు
ు యీటక్కరిమునులఁ జూచినతోడనే నా కరకాలిమంట నెత్తికి వచ్చును. వీం
రివో కల్లమాటలు చెప్పి కృష్ణుని తమవలలో వేసికొనిపోవుచున్నారు. ఆగక్కసి
మండకోడుకులు కొట్టినప్పుడు వీంద్ర మరల నిక్కడకు రాకుండునటులు కొట్టలేదైరి.
నీ పోవలతని కృష్ణునితోఁ జెప్పుదునా? అయిన నా కెందుకు? (పరిహాసముగా) ఋషు
లారా! పోదమురండు. (అని ఋషులతో నిష్క్రమించును.)

కృష్ణ—దేవీ! మునుల మనోవైకల్యముచే నాచిత్త మెంతయు జాలినొందియు
ది. కావున లోకకంటకుఁ డగునాదుండగీని నిప్పుడ పోయి శిక్షించెదను.

సత్య—నాచిన్న విజ్ఞాపన యొకటి యున్నది. మీరు పగతు నెదుర నిలిచి యు
ఘవంబున ససహాయశూరులయి పోరునపుడు కన్నులపండువుగ మిమ్మొకసారి చూ
లయునని నాకుఁ జిరకాలమునుండి యభిలాష కలదు. గనిక శిక్షార్హు లగుసేనరబా
యద్ధు నెల్లింపకలయునని వేడుచున్నాను.

కృష్ణ—దేవీ! ఇది యేటికోర్కె?

మ. నగలా నాకొమలా యమూల్యమణులా నవ్యాంబరశ్రేణులా
సొగసుం జేడియలా జగానగరులా చక్కంబుఁ బూఁదోఁటలా

మగువ ల్తోరఁగరానికోరికల నిమ్మోడ్చి న్నను స్వేదఁగాఁ
దగునే జూడఁగలారె యంగనలు భీత ల్గాక కయ్యంబులన్.

సత్య—ప్రాణేశ్వరా!

మ. నగలు న్నాకౌసులుం బ్రశస్తమణులు న్నవ్యాంబరశ్రేణులున్
సొగసుం జేడియలున్ జగానగరులున్ జొక్కంపుఁబూఁదోఁటలున్
మిగులం జేరుచె మీయనుగ్రహమునన్ మీవెంటఁ గొంపోవుచే
నగలు న్నాకౌసు లౌను నాకుఁ గరుణ న్నాముద్దు సెల్లింపరే.

కృ—దేవీ! నీ కలుగకుండు వేని నే నొకమాట చెప్పెద. యుద్ధ మన నేమిఁ దలఁచుచుంటివి?

సీ. కదలుకొండలఁ బోలు గజతండమువెకాని గండుతుమ్మెదపిండు లుండ వచ
క్రూరదానవచమూకోలాహలమెకాని యొజపుఁగోయిలకూఁత లుండ వచట
కుటిలదైత్యులమేని క్రొన్నెత్తురెకాని యొసపరివూఁదేనె లుండ వచట
పరసేన విడిసెడుబయటిసేలలెకాని యొప్పారుసౌధంబు లుండవచట
ఘూకకాకగృధ్రములు మూఁగుటయెకాని
చిలుకగోరువంక సెమ్మిగయుఁ జేర వచట
పొలసుదిండిపీనుంగులకొలయెకాని
యలరు సెత్తావి గమగమ లమర వచట.

సత్య—రణరంగ మట్లుండునని నే నెఱుంగక పోలేదు. కావున నాయాగమన కనుమతింపుఁడు. మఱియు,

తే. గీ. సగము దేహంబు నింటిలోఁ జక్క విడిచి
యనికి మీరు పోవుట యేటిన్యాయ మనఘ!

కృ—యెనిమిదిసగంబు లున్నవో యిందువదన
యేసగంబును గొనిపోదు నిప్పు డేను?

సత్య—ఏసగంబు మీ వెంట రాదలఁచుకొన్నదో యాసగమును గొనిపొండు.

కృ—దేవీ! రణమునకుఁబోవుచు రమణుల వెంటఁ బెట్టుకొని పోరాదు. జయాపజయములు మునుమున్న నిర్ణయింపఁజాలము. ఒకవేళ నాకుఁ బరాజయంబే సంభవించు నేని నేను నిన్ను రాక్షసులబారినుండి సంరక్షించుట దుర్లభముకదా!

సత్య—ఏమి! పరాజయమా? మీరొక్కరే సమరమునకుఁ బోయినను బరాజయముండదు. అందు నేను మీసన్నిధినుండ నట్టిది తలంపరాదు.

కృ—నీవు నాకుఁ బరాజయము కలుగకుండ నేమిచేయుదువు?

త్య—సీ. ఆహవంబున మీర లలసినప్పుడు మేనిచెమ్మటల్ దుడిచెద చెఱఁగుతోడ
నరమేనశరపరంపర లేయఁ దమకింప నలుఁగు లందిచ్చెద నండనుండి
సూతుండు శ్రాంతుఁడై సొమ్మవోయినవేళ నరదంబు గడపెదను వెలింగి
పగతుండు చెలరేగి పయిపయిం గవిసిన బురికొల్పి పంచెదఁ బోరొనర్ప
మఱచుపనులను జప్తికి సగల వెత్తుఁ
గలసి చేదోడు వాదోడుగాఁ జరింతు
నేయు నేటికి హృదయేశ ! విను తెలిపెద
వాలుఁ గైకొనిపోరద నలయు నేని. 41

కృష్ణ—దేవీ ! ఇంతకాలమునుండి నీ కట్టిప్రతిజ్ఞ లుండుట నే నెఱుంగ
ని. ఎన్నఁడు నేర్చితివి ?

సత్య—దేవా !

తే. గీ. విల్లువంచుట కూర్చుట వింటినారి
నలుఁగుఁ దొడుగుట యేయుట యద నెఱుఁగుట
రథముఁ దోలుట మొదలైన సకలపుఁబనులు
చిన్ననాఁటను మాతండ్రి చెప్పెఁ గొంత. 42

కృష్ణ—దేవీ ! నిన్నుఁ దోడ్కొనిపోవుట కెంత సమర్థిందుకొన్న నామనసొప్ప
యది. కలదన్న నీ వాగ్రహింతువు. పట్టపుదేవియయ్యు రుక్మిణి యెన్న డిట్టి
ల కోరియెఱుఁగదు.

సత్య—ఔను. నిశ్చయమే.

చ. అనయము భోజరాజసుతయట్టులు జాణను కానుగాని, నా
పనుపులు మీ రొనర్చుటకుఁ బట్టపుదేవిని కానుగాని, నే
నును నొకరాచకన్నియనె, న్యూనత కోరువ, నింతమాత్రపుం
జనువుల కేనియుం దగవు సత్య యటంచును నేఁ దెలింగితిఁ. 43

(అని పోఁబోవుచున్నది.)

కృష్ణ—(చేయిపట్టుకొని) సుందరీ ! పోకు. పోకు. స్మరచాపంబులఁ బోలు నీ
మలు ముడువకుము. ఇదిగో నా వెంటవత్తువు. పయనముగమ్ము.

సత్య—నే నిప్పు డనుగ్రహింపఁబడితిని. రండు పోదము.

(అని యిద్దఱు నిష్క్రమించుచున్నారు.)



శ్రీ

# ప్రసన్నయాదవనాటకము

## చతుర్థాంకము.

ప్రదేశము—ప్రాగ్జ్యోతిషపట్టణమునందలి బయలు.

(అప్పుడు వజ్రకంఠుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

వజ్ర—(తనలో) కటకటా! ఈదానవులసంపదలు గనుబొమ్మలమీఁది వెండ్రుకలవలె నెప్పటికిని నెదుగుఁబొదుగులేక యొకమచ్చుననే యున్నవిగద. ఎవఁడో యొక దైత్యుఁడు బాహుబలముచే వేల్పుల గెలిచి విజృంభించినపుడు వానిసాయంబుఁ జూచుకొని మే మందఱము గాలికి లేచి యాడు నెంగిలివిస్తరాకులవలె మిడిసిపడి యాతని యధికార మడఁగినతోడనే మరల నోరడఁగి యుందుము. బలిసినదున్నపోతు నాశ్రయించిన గోమాయులవలె బలగర్వితుఁ డగునరకమహారాజు నాశ్రయించి సుఖపడు నీరాక్షసులగతి యేమగునోకద! ఈనరకమహారాజునకు మఱియెవరితో యుద్ధము వచ్చిన నేను జంకను; కాని బలుటక్కరియు దుస్స్వభావుఁడు నగు వాసుదేవునితో నిప్పుడు యుద్ధము వచ్చెను గాన నేను విజయమునుగూర్చి సందేహించుచున్నాను. ఈవాసుదేవహతకునిచేత దేవాసుర యుద్ధములయందయిన వెనుకంజపెట్టియెఱుంగని యసహాయశూరు లగు రాక్షసప్రవరు లనేకులు నిష్కారణముగ వధింపఁబడిరి. ఇంతకు మాదినములు మంచివి కావు. అయిన నప్రతిహతప్రతాపుఁ డగునరకుఁడు శ్రీకృష్ణుని మూర్ఛిల్లఁజేయుటచే మాకే విజయమగు నని యించుకధైర్యము గలిగినది. ఇదిగో మందపాలుఁ డిటే వచ్చుచున్నాఁడు. వీఁ డెందుండి వచ్చుచున్నాఁడో తెలిసికొనియెద.

(అంతట మందపాలుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

మంద—(తనలో) ఏమి చెప్పుమా? మావజ్రకంఠుఁ డొక్కఁడు నిచ్చట నిలుచుండి యేదో యోచించుచున్నాఁడు. నే నీనడుమ గ్రామములో లేనప్పుడు విశేషము లేమైన జరిగినవేమో వీని నడిగి తెలిసికొనియెద. (సమీపించి) వజ్రకంఠా! విశేషము లెవ్వియు లేవుగదా!

వజ్ర—విశేషములు నన్నడుగుచున్నావేమి నీ వెఱుఁగవా?

మంద—నే నీనడుమ గ్రామమునందు లేను.

వజ్ర—ఏగ్రామ మెందునిమిత్తము పోయితివి?

మంద—చెప్పెద వినుము. నాభార్య మూఁడు నెలలక్రిందట పుట్టినింటికిఁ బోయి. ఆమె యక్కడనుండఁగ నే కట్టనిముండకొడుకు లెవరో పదిదినములక్రిందట రాత్రి వచ్చి నన్నుఁ బిలిచి ఓరోరీ! నీభార్యకు వైధవ్యము సంభవించినది; కాన నీవుపో చూచిరమ్మని నాతోఁ జెప్పిపోయిరి. పెండ్లి చేసికొన్నభార్య యంతదుఃఖములో న్నపుడు పరామర్శ చేయక పోవుట బాగుండదని నేను మఱునాఁ డుదయమున నే మలు దేఱి పోయి చూచితిని.

వజ్ర—పాప మాబిడ వైధవ్యదుఃఖముచేత బాధపడుచున్నది కాఁబోలు.

మంద—అబ్బే! వైధవ్యము లేదు యేమి లేదు. పసుపుకుంకుమ బెట్టుకొని కలలాడుచు మహాలక్ష్మిలాగున నాకెదురు వచ్చినది. మాదంపతులపొందిక చూచి యో క కిట్టనివాండ్రట్టివాడుక వేసిరి.

వజ్ర—ఓరీ! నీ వుండఁగ నీ భార్య ముండమోయునా?

మంద—అదియేమిమాట నేనుండఁగ లోకమునం దింతమందియాఁడువాండ్రు ండమోయఁగ నాభార్యమాత్ర మేల ముండమోయఁగూడదు? కానికాలములు వచ్చి ఏవేళ కేమో యెవ్వఁ డెఱుఁగు.

వజ్ర—సరే. నీచరిత్ర బాగున్నది. ఇక్కడి విశేషములు చెప్పెదవినుము మన మహారాజుగారిమీఁద మూఁడుదినములక్రిందట శ్రీకృష్ణుఁడు దండెత్తివచ్చె. అప్ప ండియు నతనికి రాక్షసవీరులకును ఘోరయుద్ధములు జరుగుచున్నవి.

మంద—(ఆశ్చర్యముతో) శ్రీకృష్ణుఁడు దండెత్తి వచ్చెనా? (కొంచె మాలో చి) అయినను భయములేదు. మహాశూరుఁడు మురుఁడు లేఁడా?

వజ్ర—లేకేమి యున్నాఁడు.

మంద—ఎక్కడ?

వజ్ర—పరలోకమున.

మంద—ఏమి! అతఁడు మృతి నొందెనా? ఎంతకష్టము! నిశుంభుఁ డేమయ్యెను?

వజ్ర—పాపము మురుఁ డొక్కరుఁడుం బోవలేక చిరమిత్రుఁ డగు నిశుంభుని ఁగొనిపోయెను.

మంద—కటకటా! నిశుంభుఁడు నిహతుఁ డయ్యెనా? ఇంక దిక్కెవ్వరు? పంచ డున్నాఁడు కదా?

వజ్ర—ఈనడుమ నతఁడు తండ్రిని జూడఁబోయినాఁడు.

మంద—అయ్యయో! హయగ్రీవుఁ డయిన వాసుదేవు నెదుర్కొనలేదా?

వజ్ర—అయ్యో! ఎదుర్కొనుటకేమి. అతఁడు కొంతసేపు పోరిపోరి నిన్న సాయంకాలమే రంభాసంభోగార్థమై చనెను.

మంద—అయ్యయో! సమయమునకు పంచజనహయగ్రీవు లిద్దఱు లేక పోయిరే! వారాపనులమీఁద నిప్పుడే పోవలయునా? మఱియొకప్పుడు పోరాదా, వారి నిప్పుడే పిలిపింపఁగూడదు.

వజ్ర—పిలుచుటకుఁ దగినవా రెవ్వరు లేరు. నిన్నే పంపఁదలఁచుకొన్నారము. పోవుదువా?

మంద—అయ్యో పోకేమి, స్వామి కార్యము చేయనా?

వజ్ర—అట్లయిన శ్రీకృష్ణునియెదుటకుఁ బోయి నిలువుము. అతఁడే నిన్నుఁ బంపఁగలఁడు.

మంద—ఓరి! దుర్మార్గుఁడా! నన్ను జావు మనుచున్నావా?

వజ్ర—చావకుండఁ జచ్చినవారియొద్ద కెట్లు పోఁగలవు.

మంద—అట్లయిన పంచజనహయగ్రీవులు చచ్చినారా?

వజ్ర—చావక బ్రతికియున్నారా?

మంద—నీకడుపు కాల! నీమాట లెప్పుడు నిట్లే యుండును. ఏసంగతియు సరిగాఁ జెప్పక నడ్డదిడ్డముగఁ జెప్పెదవు. ఇప్పుడు మహారాజుగారేమి చేయుచున్నారు.

వజ్ర—ఆయన యుదయమునుండియు శ్రీకృష్ణునితోఁ బోరుచున్నారు. ఇప్పటివఱకు మనపక్షము బలముగానే యున్నది. మహారాజుగారు శక్తినొకదానినిఁ బ్రయోగించి వాసుదేవుని మూర్ఛపుచ్చినారు. అందుచే మాకించుక ధైర్యము కలిగినది.

మంద—ఆదెబ్బతో వాఁడు చచ్చెనా లేదా?

వజ్ర—లేదు లేదు. వానిభార్య మూర్ఛితుఁడైనభర్తను సేదదేర్చి విల్లుగైకొని సుజలోకభయంకరముగ యుద్ధము చేయుచున్నది.

మంద—ఏమిచిత్రము. ఆఁడుదియా యుద్ధము చేయుట! ఔరా కాలమహిమ.

వజ్రి—అది యాఁడుదిగాదుగాదురా బాబు నాయుమంది మగవాండ్రను జంపినది. మతిమాలినముండకొడుకు బ్రహ్మదేవుఁడు పిడుగువంటి మగవానిని జేయఁదలఁచి మఱచి యాఁడుదానినిగాఁ జేసెను. ముల్లోకములు జయించిన మనమహారాజుగారి నది యిప్పుడు ముప్పతిప్పలు పెట్టి మూఁడుచెఱువులనీళ్ళు త్రాగించుచున్నది ఇక

ప్రతికి యింటివెనుకఁ జచ్చె నన్నట్లు మహేంద్రాదులు గెల్చిన దానవసార్వభౌ
ముఁడు తుద కాఁడుదానిచేతఁ బడునేమో యని భయము కలుగుచున్నది.

మంద—సరే. ఇంక మనదారి మనము చూచుకోవలసినదే. నీప్రాణరక్షణ
మట్లు చేసికొనియెదవు.

వజ్ర—మనము కామరూపులము గద. అందుచేత నేను నందినో పందినో పక్కి
నక్కనో పిల్లినో నల్లినో బల్లినో గొల్లినో కేకినో కాకినో చీమనో దోమనో
ాయినో అప్పనో చెట్టునో చేమనో యై ప్రాణములు రక్షించుకొనియెద. నీ వెట్లు
రక్షించుకొనియెదవు?

మంద—నేను నీవలె తుచ్ఛజంతువునై ప్రాణములు గాపాడుకోను. నే
నుఁగు నయ్యెదను.

వజ్ర—ఏనుఁగు వగుట యబద్ధము. పీనుఁగు వగుట నిజము.

(తెరలో)

క. అని దివిజేంద్రుని గెల్చిన
దనుజేంద్రుఁడు మూర్ఛవోయెఁ దనయరదముపై
మనుజాంగనచే హతుఁడై
వినిరే యెవరైన నిట్టివింతలు జగతిన్.

వజ్ర—హా! చచ్చితి; చచ్చితి.

మంద—అయ్యో! అయ్యో! ఇంక దిక్కెవ్వరు?

వజ్ర—(పలికించి చూచి) ఇదిగో గరుడధ్వజముగల శ్రీకృష్ణునిరథమును సారథి
యై పునకే తోలుకొనివచ్చుచున్నాఁడు. నరకమహారాజును మూర్ఛిల్లఁ జేసిన యా
నిసకాంతురు నిన్నును నన్నును నెటియొకబాణమున కెరఁజేయఁగలదు. కావున నిప్పు
డాత్మసత్తువకొలఁది పరుగెత్తుదము. రమ్ము.

మంద—ప్రస్తుత మింతకన్న నే యుపాయము లేదు. పదపద.

(యుద్ధము నిష్క్రమించుచున్నారు)

ఇది విష్కంభము.

---

[అంతట రథారూఢులై శ్రీకృష్ణసత్యభామలును రథముఁ దోలుచు సారథి యగుదారకుఁడును ప్రవేశించుచున్నారు.]

దార—దేవా! దేవీ! నరకుఁడు మూర్ఛనుండి తేఱువఱకు నరదము నీమఱ్ఱిచెట్టు నీడ నిలిపెదను. రణరంగమున వీరవిహారము సలిపినదంపతులకు కిందలి మందమలయానిలంబు లుపచారము చేసి శ్రమ మపనయింపఁ గలవు.

సత్య—దారకుఁడా! నీవు చక్కనిపనిఁ జేసితివి. ఇప్పుడు ప్రాణేశ్వరుని యాయాసము సంపూర్ణముగ నపనయింపఁబడు.

కృష్ణ—సుందరి! నాశ్రమ మేమున్నది? శ్రమమంతయు నీదే. ఏలయన

చ. చుఱుకుచుఱుక్కుమంచు మెయి సోకఁగ దానవుఁ డమ్ము లేయుచుం
గొరమెర ద్రోప నేను మిసిమింతుఁడనై పడియుండఁ జూచి నీ
చెఱఁగునఁ జెమ్మటల్ దుడిచి చేతిధనుస్సు గ్రహించి దానవుల్
వెఱచఱవన్ బొనర్చితివి వీరవిహారము మెచ్చ నెల్లరున్.

సత్య—శరీరమం దలఁతఁ జెందిన యవయవములు విశ్రాంతిఁ జేకొనుచుఁ గలఁత వడని యవయవములు పని సేయుట ప్రకృతిసిద్ధము గదా. అందుచే నర్ధ మలసినప్పుడు తక్కినసగము మేను పనుపము నడపినది.

కృష్ణ—కళ్యాణి!

తే. గీ. సాటి యెఱుఁగని నీమేని చక్కఁదనము
ముందు సతు లెంత సిగ్గును బొందఁగలరో
ప్రతి యెఱుంగని నీపరాక్రమముముందు
పురుషు లంతియ సిగ్గును బొందఁ గలరు.

సత్య—దేవా! ఇందు నాప్రజ్ఞ యేమున్నది.

తే. గీ. కారణంబులు దీనికిఁ గలవు రెండు
కమలనాథ! మీసాన్నిధ్యగరిమ యొండె
బగతుదౌర్బల్య మొండెఁ గావలయు సుమ్ము
కాక నేనేమి దైత్యులఁ గలఁచు టేమి.

కృష్ణ—ఈరెండును గారణములు కావు. ఇది కేవలము వినయోక్తి. సగ
చేత నలయింపఁబడిన నేను నీవిజయమునకుఁ గారణ మెట్లగుదును?

క. ఎగిరిపడితి విన్నాణులు
నానాంద్రభుజాబలంబు మాటఁ గనక నీ

గ్గగు నిప్పుడు మీముందర
నగువా! యిఁక సాగిరావు మా సుగతనముల్. 5

మఱియు,

తే. గీ. ద్వాపరయుగ రెండుచిత్రములఁ గంటి
జలజలోచన నీ సాహసంబు కతన

సత్య—ఆచిత్రములు వినఁగోరెద.

కృష్ణ—ఆఁడువారికి పౌరుషం బహుళ యొకటి
యబలభావంబు మగవారి కబ్బు నొకటి.

దార—ఇం దతిశయోక్తి యేమియు లేదు.

సత్య—అఘటనఘటనాసమర్థు లగు పరమేశ్వరులు స్వయముగ సమగవ్యాపారఁ నడపుచుండ నట్టిచిత్రములు పొడకట్టుట యొకవింత గాదు.

కృ—కళ్యాణి! నీసుశీలముచేత నీవిజయము నా కారోపించుచున్న దానవు; కాన నేను దానిని బరిగ్రహించుచున్నాఁడను.

దార—వీరపుత్రికయు వీరపత్నియు నగు నీదేవిచరిత్రము మహిషాసురుని మర్దించి దివిజలోకమును నిష్కంటకముగా నొనర్చి వాసుదేవునకు మహానందము గలిగించిన కాత్యాయనివృత్తాంతమును దలఁపించుచున్నది.

కృ—దారకా! నిజము. నిజము. ఈమెచరిత్ర మట్టిదే. ఓసుందరి! ఆసమరసమయమున నీరూపము మిక్కిలి దర్శనీయమయి యుండెను. ఎట్లంటేని.

సీ. శ్రమమునఁ బొడమిన చెమటచిత్తడిచేతఁ గస్తూరితిలకంబు కరఁగిపోవ
నృత్యముం బొనరించు నెమలిపించమయట్లు వెడఁదవేనలి జాఱి వెన్ను నిండఁ
దివ్యవిల్లుం దూఁగుతీఁగెయుయ్యాలబట్టు లాణిముత్తెపుసరు లల్లలాడ
గుణనినాదమునకు గొనబైనలయనొలె ముంజేతికడియముల్ మెఱయుచుండ
నవనవాంగకములశోభ నవయకుండ
నవక మింమికయేనియు నలఁగకుండ
వెడఁదతూపులు చూపులు వింటఁగంటఁ
బరనిమీఁదను నామీఁదఁ బరపితి వల. 7

సత్య—ఈవిజయము ఘుణాక్షరన్యాయముగ లభించినదైన నీస్వల్పకార్యముచేత మీమెప్పునకుం బాత్రురాల నయితినని సంతసించుచున్నదానను.

దార—దేవా! ఇంతవఱకు పురుషులే గాని స్త్రీలు సాంగ్రామికవ్యాపారములం దగువారు కారని నేఁ దలఁచితి. ఈ పూజ్యురాలి యతిలోకచాతుర్యము చేత నాయభిప్రాయమును మార్చుకొనవలసె.

సత్య—దారకా!

క. మగవారి నెల్లపనులకుఁ
తగువారినిగా నొనర్చి దైవము స్త్రీలన్
దగ నటుచేసెను, మగువలు
తగియెదరో తగరొ దైత్యదమనుఁడె యెఱుఁగున్.

కృష్ణ—దారకా! అంగనలు

మ. చదువన్నేర్తురు పూరుషుల్వలెనె శాస్త్రంబుల్ పఠింపించుచో
నదమన్నేర్తురు శత్రుసేనల ధనుర్వ్యాపారముల్ నేర్పుచో
మదిలోత్సాహముతోడ నేలఁగల రీయుర్విన్ బ్రతిష్ఠించుచో
ముదితల్ నేరఁగరానివిద్య గలదే ముద్దార నేర్పించినన్.

దార—దేవా! స్త్రీలు ప్రకృతిసుకుమారలగుటచేఁ బురుషప్రాపణీయము ల
మోటుపనులకుం దగ రనుకొంటి.

కృష్ణ—పువుఁబోండ్ల మేనులు సహజముగ మృదువు లయినను గాలానుగుణమగు శ్రమము సహింపఁగలవు.

తే. గీ. కరము స్పృశియించుమాత్రనఁ గందిపోవు
మల్లె సంపఁగిలోనగు మంచిపువ్వులు
పృథివి శోషిల్ల గాడ్పులు విసరునట్టి
మండువేసంగిఁ బొదలుచు నుండుఁ గాదె,

(తెరలో)

ఓరోరి యాదవపాంసనా! భార్యాభుజబలార్జితయశోగర్వితా! నిలునిలు.

మ. అని నే మూర్ఛిలినంతమాత్రమున దైత్యస్వామి నాచేత నీ
ల్గినవాఁ డంచును సంతసించి నను గేలిం గొట్టుచున్నాఁడవా?
వినుమా నామూర్ఛకుఁ గారణంబు వనితావిక్రాంతియే గాని నీ
ఘనదోస్సారము కాదు సిగ్గుపడ కీగర్వంబు నీ కేలరా?

సత్య—పిడుగువంటి యీధ్వని యెవ్వనిది?

దార—ఇది నరకునికంఠధ్వనియే.

కృష్ణ—హృదయేశ్వరీ!

తే. గీ. మొదట నీవాఁడితూపుల మూర్ఛనొంది
యసుర క్రమ్మఱఁ దెలివొంది యని యొనర్ప
నలుక రెట్టింప మన్నపైకి నరుగుదెంచె
వేటువడిన బెబ్బులివోలె నెగరిపడుచు. 12

(అప్పుడు రథమెక్కి సూతసమేతుఁడై నరకాసురుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

సూతు—రాక్షసేశ్వరా! ఇదిగో శ్రీకృష్ణుఁడు రథారూఢుఁడయి యున్నాఁడు.

నర—ఓరోరి యాదవపాంసనా! భార్యాభుజబలార్జితయశోగర్వితా! నిలునిలు. జాఱిపోకు.

ఉ. అని నే మూర్ఛిలినంతమాత్రమున దైత్యస్వామి నాచేత నీ
ల్గినవాఁడంచును సంతసించి నను గేలిం గొట్టుచున్నాఁడవా?
విను నామూర్ఛకుఁ గారణంబు వనితావిక్రాంతియే గాని నీ
ఘనదోస్సారము కాదు సిగ్గుపడ కీగర్వంబు నీ కేలరా? 13

కృ—ఓరోరి నిశాటకులపాంసనా! ఇందు మాకు లజ్జాకారణము లేదు.

క. మాయింటియాఁడువాండ్రు న
జేయుల మని విఖ్యాతికెక్కు చెనఁటి యసురులన్
మాయట్టివారి గెలువఁగ
నాసుత గర్వంబె గాక యట సిగ్గేలా?

ఓయీ నరపిశితాశన!

తే. గీ. అష్టదిక్పాలయుతుఁడైనయమరవిభుని
వ్రేల్మిడిని జయించిన మహావీరుఁడ వయి
యాఁడుదానిచేఁ బుదకట్టు లయితి వనుచు
సిగ్గుపడి చాక కెట్లు వచ్చితివి మరల? 15

నర—ఓరీ వాచాట! మీయింటి యాఁడువాండ్రు సాహసము కలవారె. ఇందు నిజమే పలికితివి.

ఉ. కొంకక నీదుచెల్లెలు మగుంగొనిపోయెను పాండుపుత్రునిన్
జంకక రుక్మిణీరమణి నాఁడు తగుల్కొని వచ్చె నిన్ను నీ
వంకఁగ నున్నయంగనల ప్రజ్ఞ నికా గరువించు టెల్ల నీ
యింకను నీది యొక్క బ్రతుకే యని మాటల నాడఁ జొచ్చితే? 16

ఓయీ నియ్యది నీకు గౌరవమే యయినప్పుడును

చ. అలయక సత్యభామమగఁడై నిను నేలుచునుండు, నింట గా
జులు తొడిగించుకొంచు నొకచోటను గూరుచునుండి భార్యవై
మెలఁగుము దానికిక్, మగఁటిమిక్ ఁబెడబాసినభర్త భర్తయే
పొలియక యప్పుడే బ్రతికిపోతివి దగ్గఱ భార్య యుంటచేక్.

దార—ఆయుష్మంతుఁడా! మరియాద నతిక్రమించి నడచువారితోఁ బ్రసంగించు టొప్పదు.

కృ—దారకా! అగును. ఏదీ వి ల్లిటుదెమ్ము.

సత్య—ప్రాణేశ్వరా! ఒక్కసారి మీ కూరకుండుఁడు. వీనితో నే నించు ప్రసంగించెదను.

కృష్ణ—సుందరీ! అనఁదగినమాటయు ననఁదగనిమాటయు నెఱుఁగనిరాతునుఁ సుమీ యితఁడు. అంతియగాక నీబాణప్రహారములచే నీవలను మనసు నొచ్చియున్న వాఁడు గావున మహాభిజాత్యముగల నిన్ను వీఁడు గౌరవింపఁ డని తోఁచెడును. మఱియు,

తే. గీ. చెనఁటికి హితోపదేశంబు చేయు టరయఁ
బెద్దపులికి ధర్మములు చెప్పెడు తెఱంగు
కఠినులకుఁ గృపఁ గలిగింపఁ గడఁగు టెల్ల
రాతినేలల నూతులఁ ద్రవ్వు టబల.

సత్య—అది నే నెఱుఁగుదును. అయినను నన్నొకసారి పలుకనిండు. ఓ!
జ్యోతిషాధీశ్వరా! ఇంచుక శాంతింతు వేని యొక్కమాట చెప్పెద.

చ. పొడమితి వాదిదేవునకు భూసతికిన్ బ్రియనందనుండవై
యడఁచితి వష్టదిక్పతుల ఖ్యాతి వహించితి విట్టు లుండియున్
గడపితి వింతకాలమును గౌర్యమె సేయుచు నింక నేనియున్
విడక ముకుందుపాదసరసీరుహముల్ భజియింపు భక్తితోన్.

వెండియు నితఁడు,

తే. గీ. మునుల కేని జిక్కనివాఁడు మొదటివాఁడు
పతితులను బావనులఁ జేయువ్రతమువాఁడు
తొంటిపుణ్యంబునను నీకు దొరకినాఁడు
భక్తిభజియింపఁ గదవయ్య పరమపురుషు.

నర—ఓసత్రాజిత్పుత్రి! ఏమీ! నీమగండు పరమపురుషుఁడా! ఈ [illegible]
[illegible] ంతుఁ డెట్లయ్యెనో చెప్పెద వినుము.

దారు—ఓయీ! రాక్షసా! మహామహిమలచేత నే యితఁడు పరమపురుషుఁడని జ్ఞానులందఱుఁ దెలియుచుండ నీ వెఱుఁగఁజాలవా?

నర—ఓహో! మహిమలవలన జ్ఞాను లెఱింగిరా?

తే. గీ. తోడివారింగలా మునులను గూడఁ గట్టి
గడుసుఁదన మెఱుంగనివారి కన్నుఁ బ్రామి
మాయ లింద్రజాలములు వేమాఱు చేసి
నంతమాత్రాన భగవంతుఁ డగునె వీఁడు. 28

సత్య—దేవా! ఇంతగా రేఁగిన యీదనుజుని పొగరుదుమారము శరాసారము చేతఁగాని యడఁగదు.

కృష్ణ—దేవీ! నేను మొదటఁ జెప్పలేదా?

తే. గీ. సన్నిపాతసంగత మైనజ్వరముచేత
నోడ లెఱుంగక ప్రేలుచు నున్న రోగి
నేవ [illegible] లవేఁడిమందులచేతఁ గాక
చక్క బడునొక్కొ శైత్యోపచారతతుల. 29

అందుచేత నే నేఁ డీనిదుర్మద మడంచెద. నిలువుండుము.

సత్య—హృదయేశ్వరా! అవును. నేనొకసారి యీనిని మూర్ఛపుచ్చఁ గలిగితి గాని సంహరింపఁజాలను; ఖండితానేకదైత్యేంద్ర [illegible] మగు మీహస్తమే యీనిని విధ్వస్తము గావించుఁగాక!

నర—ఆహాహా! ఆయిల్లాలు మెచ్చుకొనుటకే యుగాఁ డామెప్పు నంగీకరించుటకు సరిపోయినది. ఓహోరి చంద్రవంశకళంక! నీవా నాదుర్మద మడంచువాఁడవు.

చ. అణఁచితి గాదె మాగధుబృహద్రథనందనునుగ్రబలంబు నే
నణఁచితి గాదె కాలయవనాదిబలాఢ్యుల విక్రమించి నీ
వణఁచినవారె ముజ్జగములందు గణించినశూరు లెల్ల హా
హణఁ గుదయించె దిక్కెవ్వ రుపాయము వాటిలె నేమి సేయుదున్. 30

కృష్ణ—కాల మాసన్న మయినది. తొందరపడకుము.

మ. తులువా! నీవలఁ దన్నినట్టిఘనదైత్యుల్ చండదుర్వారదో
ర్బలసంక్షోభితశత్రుభూధరచమూరక్తాక్తకరుల్ ప్రేల్మిడిన్
శలభంబు ల్బలె మ్రగ్గినారు సుమి మద్బాణాగ్ని నీ వెంత ప్ర
క్కలు గావించెద మస్తకం బిపుడె నీగర్వంబుఁ ద్రుక్కించెదన్. 31

మ. మునులం జంపితి జన్నపుంబశువులన్ మ్రుచ్చిల్లి తంతఃపురాం
గనలం బల్మినిబట్టి తెచ్చితివి స్వర్గంబెల్లఁ జూఱాడితి
వన్ని వర్ణింతును జెప్పవచ్చును మితంబైనన్ మహీ స్నివుచే
యని దోసంబులు చెందరానిగతు లెందైనం గనన్ వచ్చునే.

నర—(నవ్వుచు) ఓరోరి యదువంశజలధిబడబానల ! ఈదోసంబులు కొన్ని న యందు కాదు నీయందు బొడగట్టుచున్నవి సుమా !

మత్తకోకిల. చేసినాఁడవు స్త్రీవధంబును జిన్ననాఁటను గూళవై
చేసినాఁడవు గోవధంబును జేడె నీల నిమిత్తమై
తీసినాఁడవు మాతుప్రాణము దిక్కులేని యవస్థ నీ
చేసియుండని దోస మున్నదె సిగ్గుమాలిన పేరిలరీ !

అది యటుండనిచ్చి నే నొక్కటి యడిగెదను. దానికుత్తర మిమ్ము.

క. శిశుపాలుఁడు మఱఁది గదా
శిశుపాలుఁడు వలచినట్టి చేడియ నీకున్
విశదముగఁ జెల్లెలే గద
పశువా యేమనుచు దానిఁ బట్టితి చెపుమా.

దోసంబు లన్నియును నీయందె యుంచుకొని మీఁదు విక్షాలి మమ్ము గలుషాత్ము లనె దవా ? శాత్రవదుర్నిరీక్ష్యవిక్రమక్రీడారంభులగు తేజోవిహీనుఁ డగుబిడౌజుని ది లకసమేతముగా నోడించి పుచ్చి జాత్రేయం బాక్రమించుట నేర మగునా ? ఇది శాస్త్ర గాదా ? పాఱుఁబోతు వగు నీకు శాస్త్రమేమి తెలియును ?

కృ—రాక్షసాధమా ! శాస్త్ర మనుసరింపఁ దలంచినచో నీవు త్రివిష్టపమున దండెత్తవచ్చును. సహజవైరి యగుమహేంద్రు నెదిరించి గెలువవచ్చును—కాని

మ. నిను నిందించిరె, నీపయిం గనలిరే, నీపోలికిన్ వచ్చిరే,
మునుదుం గానల ముక్కు మూసికొని బ్రహ్మధ్యానముం జేయు స
న్మునులం గొట్టితి వేమి చేసిరి మహాత్ముల్వార లాలోక పా
వనులం జంపుటయా పరాక్రమము నాపైఁ జూపు నీ తేజమున్.

సీ. క్షుద్రాత్ముఁడవు నీకు జోహారులొనరింప బలహీనుఁ డగువజ్రపాణి గాఁడు
నీదశంబులఁ జూచి నిర్విణ్ణులై పాఱి ముక్కుమూసికొను వైఖానసులు గారు
నీవిగ్రహముఁ జూచి నిశ్చేష్టలగుటకు వనజాక్షు రాజకన్యకలు గారు
నీవిభీషికలచే నిర్వేగపడుటకు బగసాంగవ్యులు భూసురులు గారు

ఎవ్వఁడుగఁ దలంచితివో యీ వెదను నన్ను
సకలభూతభయంకరజన్వరంగ
ఖండితానేకదైతేయ కంఠనికర
దేవతాచక్రవర్తిగాఁ దెలిసికొనుము. 39

నర—శ్రీగౌరియాశ్వరంమన్య! నీవు భగవంతుఁడ వని యీవఱకు నీభార్య సత్య
స వచియించినది. ఇప్పుడు నీనోటనే వినుచున్నాఁడను. ఇట్లుఁ దలంచుట నీ నేరము
ను. చదువులు నేర్చిన దుష్పండితులు కొందఱు జగద్వంచనము చేయఁదలఁచి—

సీ. కలిమెండ్రుకోలు నీ కాయపుంజాయలు కారుమబ్బులకు సంగడము లనిరి
నీముచ్చుఁదనములు నీఱంకుకతలు నీలేకిపనులు విష్ణులీల లనిరి
నీపంచకత్వంబు నీగుట్టు వెలిఁబుచ్చు ధర్మాత్ములను దుష్టదైత్యు లనిరి
నీకు గులాము లై నిరతంబు గొనియాడు తెలివిమాలినవాండ్ర దివ్యులనిరి
అన్నిగుణములయందు నీ కన్న హైన
త్రాగుఁబోతును శేషావతారుఁ డనిరి
ఒక్కప్రోటకు గతిలేని బక్కవాని
విశ్వమయుఁడగు నమ్మహావిష్ణు వనిరి. 40

ష నారాయణుఁడ నని నీలో నీవెంత మురిసినను మునిముచ్చులు నిన్నెంతఁగొని
డినను నీ వచ్యుతుఁడవు గావు. నక్క పార్వతియగునేని, కప్ప నారాయణుఁడగు
ని నీవు హరివగుదువు నాయొఱింగినంతవఱకు,

శా. నీకన్నం గడు దుష్టకష్టమతియున్ నీకన్నఁ బాపాత్ముఁడున్
నీకన్నం గఠినాత్ముఁడుం గుజనుఁడున్ నీకన్న దుర్మార్గుఁడున్
నీకన్నంబలు కాకియుం జెనఁటియున్ నీకన్న దుశ్శీలుఁడున్
నీకన్నం జడుఁడుం గనంబడఁ డిల న్నిర్భాగ్యదామోదరా! 41

వురనో ముప్పురనో బక్కరక్కసుల వొంగపోటుగఁ జంపి దనుజాంతకుఁ డనునలీక
రుష నామము ధరించి బెదరింపఁజొచ్చెదవా? ఒకవేళ నీ వనుకొన్నట్లు భగవంతుఁ
యగుదువు గాక!

క. భగవంతుఁడవే యైనను
భగవంతుని తాతవైన భయపడఁ జుమ్మీ
తెగటార్చెద పగఁ దీర్చెద
మగవాఁడవయేని నిలిచి మాఱ్కొను నన్నున్. 42

సత్య—(మెల్లఁగా) ప్రాణేశ్వరా! ఎంతసే పిటఁ గోడలుమఱచి ప్రేలుట.

కృష్ణ—సుందరీ ! ఈతనిప్రల్లదంబు లిప్పుడే తుదముట్టఁగలవు. ఓరోరి దైత్యాధమా ! అవ్యవస్థితము లగునీదుర్భాషలకుఁ బ్రత్యుత్తరంబు గాసంగ నక్కర లేదు. ఏమంటివేని,

మ. చకితబ్రాహ్మణగోవధూనికరముల్ సమ్మోదముం బొంద వై
దికధర్మంబులు సాగ నెప్పటి యటుల్ ; దివ్యుల్, ప్రహర్షింపఁగా
సకిరీటంబు సకుండలంబు సశిరస్త్రాణంబుగా నీదు మ
స్తకముం ధాత్రిఁ గూల్చువాఁడ నిదె మచ్చక్రాహతిన్ దుర్మతీ!

దేవీ ! చక్ర మిటు తెమ్ము.

నర—ఓరోరిక్షత్రియకులాపశదా ! ఏమి ! సకిరీటంబు సకుండలంబు సశిరస్త్రాణంబుగా నాదు మస్తకమును గూల్చెదవా ?

సీ. జవరాండ్రతోఁ గూడి సరసమాడుట గాదు మరలించుటకు నాలమంద గాదు
జున్ను మీఁగడ వెన్న జుర్రుకొనుట గాదు పడఁదన్నుటకుఁ జిన్నబండిగాదు
పాలీయవచ్చినపడఁతి చంపుటగాదు చితుకఁద్రొక్కఁగ నీటిచిలువగాదు
మతిలేక యుండిన మామఁ గూల్చుటగాదు పెల్లెగురుటకు వ్రేపల్లెగాదు
ఆ జరాసంధునకు నోడి మథుర విడిచి
నట్టనడిసముద్రంబున నగరు గట్టి
కాపురం బున్న జెట్టివి గావె నీవు
నన్నుఁ గూల్చువాఁడవు నీవె నందతనయ.

నీవు చక్రంబును ధరింపుచున్నాఁడవు గావున నే నిదె వింట బ్రహ్మాస్త్రముఁ దొడుగుచున్నాఁడను.

క. ఎక్కలము లేల పలికెదు
వెక్కులు ; నరకాసురుండు విడువఁడు నిను నీ
వొక్కమ్మకు నొక్కయ్యకు
నిక్కముగా పుట్టితేని నిలువుమా యెదుటన్.

సూతుఁడా ! రథము గోపాలున కభిముఖముగాఁ ద్రిప్పుము.

సూతు—దేవా ! అట్లే చేయుచున్నాఁడను.

కృష్ణ—దారుకా ! రథము దానవున కభిముఖముగాఁ ద్రిప్పుము.

దారు—ఆయుష్మంతుఁడా ! అరదము వాని కభిముఖముగానే యున్నది.

(తెరలో)

నరకమహారాజా ! శరణు ! శరణు ! ఈగరుత్మంతుఁడు మమ్ముం బ్రతుకనిచ్చుట లేదు. వాటిలినఖరాగ్రమ్ముల నెత్తురుకండలఁ జెకలించియు జంచుపుటంబున మేనులఁ జీల్చియు

క్షోఘాతంబులం దూల్చియు నితఁడు దానవసైన్యంబుల దైన్యంబు నొందించుచున్న గాఁడు. రక్షింపుము. రక్షింపుము.

నర—ఓ దనుజులారా! వెఱవకుఁడు. వెఱవకుఁడు. ఇదిగో వచ్చుచున్నాఁడ. సూతుఁడా! రథము తోలుము.

సూతు—ఇదిగోఁ దోలుచున్నాఁడను. (ఇద్దఱును నిష్క్రమించుచున్నారు.)

దార—దేవా! ఈదురాత్ముఁ డీ నెపము పెట్టి తప్పించుకొనిపోయినాఁడు.

కృ—వాఁడు పలాయితుఁ డయినను మనము వానిని విడుతుమా.

దా—వీఁడు. కర్ణకఠోరముగా నొనరించిన భగవద్దూషణమునకు తత్క్షణమే వధ్యుఁడు.

సత్య—దారకా! భగవంతుని దెలిసికొనుట కెంతవారు గావలయును.

శా. శ్రీరంజిల్లఁగ ముక్తి నామక మహాసీమంతినిం గూడి యోం
కారస్యందన మెక్కి స్వచ్ఛ మయి విజ్ఞానాత్మకం బైన గం
భీరాకారముతోడ నయ్యుపనిషద్వీధి న్నిరాఘాటసం
చారంబుం బొనరించు నీకు నెఱుఁగన్ శక్యంబె దైత్యాళికిన్ 46

దార—అమ్మా! నీమాట నిజము. ఈశ్వరు నెఱుఁగుటకు వీఁ డెంతవాఁడు.

కృ—దారకా! నరకునిమీఁది కరథమును సత్వరము తోలుము. ఇప్పుడే వానిని గ్రంబున కేరఁ జేసెదను.

దార—చిత్తము. (అని తోలుచున్నాఁడు.)

(అందఱు నిష్క్రమించుచున్నారు.)



శ్రీ

# ప్రసన్నయాదవనాటకము

## పంచమాంకము.

(అప్పు డేడ్చుచు వజ్రకంఠుఁ డను రాక్షసుఁడు ప్రవేశించును.)

వజ్రి—(తనలో) హా నరకమహారాజా ! హా శ్రితజనకల్పద్రుమా ! హా ద కులపారిజాతమా ! హా సుగుణరత్నాకరా ! దురాత్ముఁ డయినకృష్ణునిచే నిష్కా ముగా వధయింపఁబడితివా ? అయ్యయ్యో ! ఇంక మాకు దిక్కెవ్వరు ? నీయండ ను బట్టియేగదా దిక్పాలకులను స్వర్గమునుండి దొంగలను దోలినట్లు తోలి కంటి కగ దేవతల నందఱను చేతికిదొరకిన బడితెలతోఁ గుక్కలను కొట్టినట్లు కొట్టఁగలిగి నీసంరక్షణమున నుండఁబట్టియే గదా మేము గాడిక్రింది పంచకొట్టులవలె నే వెలితి లేక హాయిగా సుఖించితిమి. నీపేరు దివ్యులకు సింహస్వప్నము గదా ? ఆమేలుదినము పోయినవి. మందభాగ్యుల మగుమాకు నీవంటి యుత్తమోత్తముఁడు దొరకునా ? న్యాయమునకు దినములుగావు. అందుచేతనే స్వకులాభిమానులును ధర్మస్వరూపు తేజోరాసులును నగుమీవంటివారు కడునీచులచేత నడియుటయు దుర్జనులును దు ర్గులును దుశ్శీలురు నగువేల్పులు జయించుటయు సంభవించుచున్నది. లోకము సెందఱికైనను చావున్నది కాని యీపాడుముండకొడుకు కృష్ణునకుఁ జావులేదుగ మారక్కసుల నందఱఁ జంపినాఁడు. వారి యాయువుఁ బోసికొని చిరంజీవియై బ్రతు చున్నాఁడు. 'పాపీ చిరాయు' వన్నమాట వీనియందే సార్థకమగుచున్నది. ఈపా త్మునకుఁ బురిటిలో సందైనఁగొట్టదయ్యె. పాలపాపచిన్నయున రాదయ్యె. ఏదక్క చేతంబడి నైనఁ జావడయ్యె. ఏరోగములేక నాచిన్నప్పటినుండియు నీకృష్ణు [illegible] నిల్లియున్నాఁడు. ఎంతో ధైర్యవంతుఁడను నేనే యింత బెంగఁ గొనఁ [illegible] నపాలుఁడు లోనగువా రెంత కడుపగలి యున్నవారో గదా !

[అంతట పెద్దపెట్టున నేడ్చుచు మందపాలుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

మంద—(లోనలో) హా! రాక్షసరాజా! నీకింతలోఁ గాలమాసన్నమైనది. నీవు లేకపోవుటచేఁ బాపాత్ములగు మునులు దేవతలుఁ జెలరేఁగి మాకొంపలు త్రవ్వుదురుగదా! ఇఁక మాకెవ్వరు దిక్కు. నే నేమి చేయుదును? చిన్నతనమునుండియు నన్నదమ్ముల లాగున పెరిఁగితిమి గనుక నేనును మావజ్రకంఠుఁడును గలసి యేదో బ్రతుకు తెరు వాలోచించుకొనియెదము. ఇదిగో వాఁడిచ్చటనే యున్నాఁడు. (అని సమీపించును.)

వజ్ర—(ఏడ్చుచు మందపాలునిఁ గౌఁగిలించుకొని) మన మహారాజుగారిని కృష్ణుఁడు తనపొట్టను బెట్టుకొన్నాఁడురా! అన్నయ్యా!

మంద—మన మిప్పుడు దిక్కుమాలినవారమైనాముగా! తమ్ముఁడా!

వజ్ర—ఎల్లప్పుడు నా పొడు వేల్పులపంతమే నెగ్గుచున్నదిరా! అన్నయా?

మంద—మననోట శనియుండఁగా మనపంత మెట్లు నెగ్గునురా! తమ్ముఁడా!

వజ్ర—మనుష్యుల నెత్తురు గావలసినంత పానకము ద్రావినట్లు గుటగుట త్రాగు వారముగదా! అన్నయ్యా!

మంద—మొక్కజొన్నపొత్తులవలె నిగ్రహముగాఁ గావలసినప్పుడు మనుష్యు గాల్చుక తినెడువారము గదా! తమ్ముఁడా!

వజ్ర—ఆవైభవమే పోయిందిరా! అన్నయ్యా!

మంద—అప్పుడే పట్టణమంతా పాడువాఱిందిరా! తమ్ముఁడా!

వజ్ర—ఇంతపని చేసినకృష్ణునిఁ గడతేర్చుటకు నుపాయ మాలోచింపవలయును

మంద—బుద్ధిమంతులము మన మిద్దఱముఁ దలఁచుకొన్నపక్షమున వాఁ డింక తుకఁగలఁడా?

వజ్ర—అట్లయిన కృష్ణు నేవిధమున మృతినొందింతము?

మంద—నీవు త్రాఁచుపామువై వానిని గఱవుము.

వజ్ర—వెంటనే గరుత్మంతుఁడు నన్నుఁ జీల్చి చంపఁగలఁడు.

మంద—అవునవును. అది వీలులేదు; పోనీ, పులివై వానిఁ గడతేర్పుము.

వజ్ర—అతఁడు నరసింహామూర్తి. అందుచేత నతఁడు పులిమీఁద పుట్ర.

మంద—నిజము నిజము. అది వలనుపడదు. పోనీ కొండనై నేను వానిమీఁదఁ బడుదునా?

వజ్ర—వాఁడు కొండ గుండఁ జేయఁగలవాఁడే. గోవర్ధన మెత్తలేదా?

మంద—నిశ్చయమే. ఈయుపాయములు బాగులేవు. ఈదొంగపోటులేల ? కత్తి చేతఁబూని వీరులమై వాని కెదురుగఁ బోయి వధియింతము. మృతినొందుదు మనుభయము లేదు. [illegible]. ఎప్పుడు పోయినను పోవును.

వజ్ర—అవునవును. మహారాజుగారే మృతినొందఁగా మన మెంతవారము. తుచ్ఛప్రాణములపై నాశ విడిచి స్వామిభక్తిని జూపుదము. రమ్మొకత్తులఁ దెచ్చుకొందము.

మంద—ఉండు. ఉండు. ఎవరో వచ్చుచున్నారు.

వజ్ర—(చూచి) హా! చచ్చితిని. వాఁడు కృష్ణుని సారధి యగు దారకుఁడు.

(అంతట దారకుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

దార—(తనలో) భగవంతుఁడు శ్రీకృష్ణుఁడు నన్నుం బిల్చి, దారకా! పితృవిహీనుఁ డగుభగదత్తుకుమారుని నే నిప్పుడ చూడవలయు. వానికి నారాఁక నెఱిగింపు మని యానతిచ్చె. అతఁ డెందున్నవాఁడో తెలిసికొని యిప్పుడే సందేశ మెఱిగించెద.

మంద—ఓరీ! వజ్రికంఠా! మన మిప్పుడు పాఱిపోయినను వీఁడు చంపును పాఱిపోక నిల్చినను వీఁడు చంపును. గతి యేమి?

వజ్రి—వానిమాట కెదు రాడకపోయినచో వాఁడు మనలఁ జంపఁడు,

దార—ఓయి! మీరెవరు? కుమారభగదత్తుఁ డెందున్నవాఁడు.

మంద—(గజగజవడఁకుచు) మేము నర-నర-నర-నర.

వజ్ర—(గద్గదస్వరముతో) మేము నరకుని బంట్లము కాము.

దార—మీరింత భయపడ నక్కఱలేదు. నేను మీజోలికి రాను. భగదత్తజాడఁ దెల్పుఁడు.

వజ్ర—అయ్యా! నరకాసురుఁడు పలుమదుర్మార్గుఁడు, కడునీచుఁడు, నీతిహీనుఁడు నగుటచే మే మతని సేవించుటలేదు.

మంద—అయ్యా! భగవంతుఁడగు శ్రీకృష్ణునకు నరకుఁడు విరోధి యగుట వానిసేవించుట మానితిమి.

దార—(తనలో) ఈపిరికిముండకొడుకులు నాకు వెఱచి యిట్లనుచున్నారు. (ప్రకాశముగా) రాక్షసులకు సయితము నంతటి యసహ్యము గలిగించు దుర్గుణము నియొద్ద యేమియున్నవి.

వజ్ర—ఒకటా, రెండా చెప్పనలవిగాదు. స్త్రీలఁ జెఱపట్టుట. మహర్షుల బాధించుట, యాగములకు విఘ్నములు సేయుట, విష్ణుభక్తులను వధించుట మొదలగు పాతకముల ననేకములు చేసెను.

మంద—ఆపాతకుని పేరు మన మిక్కడ తలపెట్టరాదు. కృష్ణుఁడు వానిం జంపి లోకమునకు మేలు చేసెను. వాఁడు తప్పక చావవలసిన వాఁడే.

దార—మీప్రసంగములు చాలించి భగదత్తునిజాడ నెఱుఁగుదు రేని చెప్పుఁడు. నిచో మీదారిని మీరు పొండు.

క్రజ—స్వామి! మాకాజాడ తెలియదు. నాకు సెల వొసంగుఁడు. పోవుదుము. రారా! మందపాలా! (అని యిద్దఱు కొంచెము నడచి రహస్యముగా) గండము గడచి ంవతల పడితిమి. త్వరగా పరుగెత్తుక పోవుదము రమ్ము. (అని యిద్దఱు నిష్క్రమించు న్నారు.)

దార—(తనలో) నా కిప్పుడు భగదత్తునిజాడఁ దెలుపువా రెవ్వరు? అదిగో క్కడ యొకకంచుకి యగపడుచున్నాఁడు; వాని నడిగెద. (ప్రకాశముగా) ఓయీ!

[తెరలో]

అయ్యా! ఆతఁడు దుఃఖపరవశుఁడై తండ్రికళేబరము జూడఁగోరి పొలికలనికిం వ నుద్యుక్తుఁడై యున్నాఁడు.

దార—(ఆలకించి) సరే! నేనిప్పు డతనియొద్దకుఁ బోయి సందేశ మెఱిఁగింపన లేదు. వాసుదేవుఁడే వానిని యుద్ధభూమిలోఁ గలసికొనఁగలఁడు. (అని నిష్క్రమించును)

ఇది విష్కంభము.

---

అప్పుడు యుద్ధభూమిలో మూర్ఛితుఁడైన భగదత్తుఁడును శంబర మంత్రియుఁ బ్రవేశించుచున్నారు.

శంబ—(తనలో) పితృవియోగదుఃఖము దుస్సహమైనదే. ఈభగదత్తుఁడు తం కళేబరము నొక్కసారి చూచి మూర్ఛితుఁడై యింకను స్మృతినొందకున్నాఁడు. నుగ్రహమున వీనికిఁ దెలివి వచ్చునేని వీనిని తండ్రికళేబరమువద్దకు మరలఁ బోనీ ండదు.

తే. గీ. భూరిసంతాప మొదఁ బొంగి పొగలువపుడు
చల్లఁదనమును వెదచల్లుసంగడీల
యూఱడింపుబల్కులుపాచు సుమ్మలంబు
పాలపొంగును చన్నీరు పాపునట్లు. 1

భగ—(మూర్ఛనుండి లేచి) హా! తండ్రీ! జగత్త్రయైకవీరా! తృణీకృతపురంద ర్వాలకా!

ఉ. తోలితి వాలమండలము దోలినపోలిక వేల్పుమూఁకఁ, ది
క్పాలుర ద్వారపాలకులుగా నొనరించితి, కోటకొమ్మలన్
వ్రేలఁగఁ గట్టినాఁడ పరినిర్జరశిరంబుల, నట్టినీవు గో
ష్పాలుని పాల్పడఁ గావలసి వచ్చెనె యీశ్వరమాయ నక్కటా !

క. తలిదండ్రులకుం దమతన
యులపైఁగల యంగకార్మి యుండదు తలిదం
డ్రులపై బిడ్డల కనియెడి
పలు కిప్పుడు నాకు నిక్కువంబై తోఁచున్.

అందుచేత నేగదా నేను నిన్ననుసరింపలేకపోయితిని.

శంబర—(సమీపించి) కుమారా! ఊఱడిల్లు మూఱడిల్లుము.

భగద—అయ్యా! శంబరమంత్రీ! ఇది నేను స్వయముగాఁ దెచ్చుకొనినది కాదు అందుచేత నేనడపఁజాల. అయిన నిటు విను.

సీ. ఎవని మెప్పును బొంది నేవేళ ఘనముండు వెచ్చనిగాడ్పులు వీవ వెఱచు
నెవనియల్కకు నోడి యెన్నఁడు భానుండు గట్టిగా నెండలు గాయ వెఱ
చెవనియానతిలేక యెప్పుడు పర్జన్యుండు గొప్పగా వానలు గురియ వెఱచు
నెవనిదాడికి నోడి గోష్ఠ్రిద్ధ మహనైరి కుదురుగా కనుమూసి కునుక వెఱ
నెవని పేర్విన్నమాత్రాన ధృతిఁ దొలంగి
దిగ్గజంబులు స్వేచ్ఛమై తిరుగ వెఱచు
నట్టిజగదేక వీరుఁ బోఁగొట్టుకొంటి
నింక నూఱట గల్గుట యెట్లు నాకు.

శంబర—నీతండ్రి నిజముగా నీవన్నట్లు నిరుపమానతేజోరాశి. విచారింప కార్యము లేదని నే నిట్లు నీ కుపదేశించితినిగాని నీకుఁ గలదుఃఖము నే నెఱుంగ సేవకుల మయినమేమే యెంతో మఱుఁగుచుండఁగా గారాబుకొడుకవయిన నీ దురపిల్లుచుండువో చెప్పవలయునా? కావున నిప్పుడు కార్యగతులఁ బరిశీలి వర్తింపుము.

భగద—అయ్యా! ఈసమయమునందు.

తే. గీ. ధైర్యశాలి కన్నని రెండుకార్యగతులు
జనవుఁ దెగటార్చు పగతునిఁ జంపుటొండె
సమరముఖమునఁ దానైనఁ జచ్చుటొండె
కానఁబడదింక నాకన్యకార్యసరణి.

శంబర—కుమారా! అది గాదు. తండ్రికి నగ్ని సంస్కారంబు చేసి యుత్తరక్రియలఁ జేయుటయే కార్యపద్ధతి.

భగద—హా తండ్రీ! భువనైకమల్లా! నీవిపుడయినను యెట్టిదారుణవచనంబులు పలికె.

మ. అపచారం బొనరింప నెన్నఁడును నే నాబాల్యము న్నీకు నే
డుపచారంబును నీవు నావలన మున్నొక్కింత స్వాదుం గోరవై
తిపు డీకీర్తిని గోరఁగాఁ దగునె తండ్రీ యగ్ని సంస్కార మే
యుపచారంబగు వేళ వచ్చినదె యయ్యో నాదునిర్భాగ్యతన్. (మూర్ఛిల్లును)

శంబర—కుమారా! ఏమి యీ చేలతనము! (తనలో) ఈతఁడు మాటిమాటికి మూర్ఛిల్లుచున్నాఁడు. ఇతనికిదుఃఖోపశమన మెట్లగును చెప్పుమా? శుక్రశిష్యుల కెంత యవస్థ సంభవించినది.

[అప్పుడు రాక్షసగురు వగుశుక్రుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

శుక్ర—(తనలో) అసురులు వేల్పులకన్న నెక్కుడు తేజోదర్పితు లయినను నైశ్వర్యము వినశ్వర మగుటకుఁ గారణ మేమి? (కొంచెము ఆలోచించి) కారణ మయి వెదుక నక్కఱలేదు.

మ. సిరి యెల్లప్పుడు ధర్మమూల మనుచుం జెప్పంగ విందుర్, ధర్మత
త్పరుఁడౌ నాతనిభూరివైభవము నిత్యంబై ప్రవర్ధిల్లు, దు
ష్కరుఁడై ధర్మము వీడు మానవు మహైశ్వర్యంబు లీభూమికిం
బరువై గట్టి పువాది లేనియిలు లేనం గూలు నొక్కుమ్మడిన్. 7

దానవులు ధర్మేతరమార్గవర్తను లగుటచే వారికడ సిరి యుండదు. ఎట్లయినను నతఁడు మాకుఁ బ్రియశిష్యు లగుటచే వాత్సల్యంబు పెంపున మేము వారిని సమాదరింపక తప్పదు. ఇప్పుడు పితృశోకదుఃఖితుఁ డగుభగదత్తకుమారుని సమాశ్వాసింపవలయును.

భగద—(స్మృతిఁ దెచ్చుకొని) తండ్రీ! నీవు లేమి జగమంతయు నంధకారమయము యున్నయది. ఏలయన,

తే. గీ. పృథివి యంతయు నేఁడు నిర్వీర మయ్యె
రాజకులము నెల్ల నేఁడు నిస్తేజమయ్యె
దితిజవంశంబు నేఁడు నిర్గతిక మయ్యె
నీవు లేనివెలితి ధాత్రి కెట్లు దీరు? 8

శంబర—కుమారా! ఇదే నీనిమిత్తము భగవాను లగుభార్గవులువచ్చియున్నారు.
వాదముచేసి సగౌరవము నమస్కరింపుము:

శుక్ర—కుమారా! ఊఱడిల్లు మూఱడిల్లుము.

భగద—(కన్నీళ్ళతో) భార్గవా!

మ. కదనోద్ధూతబిడౌజుఁ డాసురవధూకళ్యాణసంపాది, యదు
న్మదరాజన్యశిరోవతంసవిలసత్పాదాగ్రపీఠుండు, శ్రీ
విదుఁ డసజ్జనకుండు మాహితుఁడు మాబిడ్డండు మాశిష్యుఁ డ
ల్లదె నేలంబడియున్నవాఁడు హతుఁడై యాచార్య కన్గొంటివే ?

శుక్ర—వత్సా! మృతు లయినవారిని మనము దుఃఖించి క్రమ్మఱ బ్రతికింప జాలము. చిరసంబంధముచే నెంత యోఁచుకొన్నను దుఃఖాతిశయముచేత నేను కన్నీరు విడువక తప్పినదికాదు. తలఁచుకొనిన కొలఁది దుఃఖము పొరలిపొరలి వచ్చుచునే యుండును; కావున నీవింక నీతఁడని మఱవవలయును.

భగద—అయ్యా! వేదాంతవిద్యారహస్యజ్ఞాతలు అగుమీరే దుఃఖమున కప్పుడప్పుడు వశులగుచుండ నింక మాదృశులా దుఃఖసాగరము నీదువారు!

చం. మఱవఁదలంతు నాయెడల సుజ్జనతం దొనరించు గార్యముల్
మఱవఁదలంతు వానియసమానగుణంబుల నెల్లఁ గాని యో
నెఱతన మాజగద్వినుత నిష్ఠురవిక్రము నా సుమూర్తియున్
మఱవఁదలంచినన్ మఱవ నాతరమా నిమిషార్ధమేనియున్.

శుక్ర—ధైర్యసాగరుఁ డగునరుఁడనఁ దనయుఁడ వయిన నీవిట్లనఁ దగదు.

భగద—అయ్యా! ఇప్పు డేమి చూచుకొని నేను బ్రదుకుదును ?

శుక్ర—కుమారా! ఏమియు లేనే లేదా?

తే. గీ. తల్లి గలదు రాజ్యరమాతల్లి గలదు
ప్రజలు గలరు నీకుఁ గన్నప్రజలు గలరు
పడుచువాఁడవు నీ కేమి బ్రతుక కేమి
చన్నవారితోఁ బోదురే యున్నవారు.

భగద—అవి యుండుట నే నెఱుఁగుదును.

ఉ. ఉన్నవి వాజివారణము లున్నవి సంపద లెన్నియేని నా
కున్నవి నందనోపమమహోపవనంబులు నెక్కు లేలగా
నున్నవి యూళ్లవె న్నయిన నున్నవి సైన్యము లెన్ని యున్న నే
మన్నరకుండు లేమి నవి యున్నియు లేనటు తోఁచు భార్గవా !

శుక్ర—వత్సా! అట్లయిన నీయుద్యమ మేమి ?

భగద—పితృపురుషుల యుద్యమమే నాయుద్యమము.

శంబ—ఈయుద్యమ మనుచిత మయినది.

శుక్ర—ఏమి ? నీవు హరితోఁ గయ్యమునకు సన్నద్ధుఁడ వయ్యెదవా ?

భగద—ఆచార్య ! మ రేమి!

ఉ. అంతటివానికిం గొడుకవై, ప్రియశిష్యుఁడవై ధరిత్రి మీ
యంతటివానికిన్, బ్రభువవై దితిసంతతి కెల్ల, నిన్ను నా
శ్చింతయశంబుతో నడరి యీసమయంబున బందనోము నే
నంతము సేయకుంట తగవా నరకాంతకు నఘ్నురాంతకున్. 13

శుక్ర—ఓయీ ! వెఱ్ఱివాఁడా ! నీతండ్రికిని నీతండ్రులకుఁ దన్నిన ముక్కంపురక్కసులకును నలవిగాని యీపని నీకు సాధ్యమగునా ?

క. ఏమనుకొంటివో నీమది
సామాన్యుఁడు గాఁడు చక్రి సమరంబున నీ
చే మర్దింపంబడుటకు
నామాటలు వినుము సంధి నడుపుము వత్సా !

శంబర—(శుక్రునితో మెల్లఁగా) దేవా ! ఈయుద్యమ మెట్లయినమాన్పి దీనుఁ
ల మనుగ్రహింపుము.

శుక్ర—కుమారా ! కృష్ణునిప్రభావము వినఁగోరుదు వేని నే నించుక ప్రకటించెద వినుము. అతఁడు మహీభారావతరణార్థమై యదుకులంబున నవతరించిన హరిగాని మనుజుఁడు గాఁడు. అందుచే నతఁడు,

సీ. పసితనంబున నేలఁ బ్రాక నేర్చిననాఁడె పగరకోటుల నెగఁబ్రాక నేర్చెఁ
జిన్నఁగా నక్షవిద్దెయును నేరనినాఁడె దితిజులఁ జంపువిద్దెయును నేర్చె
నిల తప్పటడుగులు నిడుట నేరకమున్నె వెసతప్పటడుగులు వెట్ట నేర్చె
నయ్యాలలం దుండి యుగ్గుత్రాగెడునాఁడె కిగ్గాడ యసురుల నుగ్గు చేసెఁ
బాలు గుడుచునప్పుడె నేలపాలు చేసెఁ
బ్రబలదైత్యులఁ బలువురఁ బలము మెఱయ
నతఁడు మాపినకులము లెన్నైనఁ గలవు
వలదువలదన్న హరితోడఁ బగలు మనకు. 15

డియు నతఁడు మాయలఁ బ్రయోగించుటయందు నెఱకాఁడు.

శంబర—అవును. వైష్ణవం బైనమాయ దుస్తర మని వినుచుందుము.

భగద—పగతుల సాధించుట కతఁడు మాయలనే ప్రయోగించునా ?

శుక్ర—వత్సా ! మ రేమి ? చూడుము.

మ. కెడపెన్ గంసుని, జంపె హంసుని దృఢిం గెల్చెన్ జరాసంధునిన్ ;
బోడిచెన్ జాంద్రకుఁ, గూల్చె గాలయవనున్, బోకాల్చెఁ జేదీశుఁ జ
క్కడచెన్ బూతన, వీరి నందఱను మాయల్ వన్నియే చక్రి గా
పడచెన్ గాని, పరాక్రమస్ఫురణచే నంతంబు నొందించె నే.

అవి యన్నియు నేల ? నాస్వవిషయమున నే నించుక చెప్పెద వినుము. తొల్లి య
డు మహేంద్రరక్షణము చేయ నదితికశ్యపులకు వామనుఁడయి జనియించి దీనచింత
మణి యగుబలిచక్రవర్తియొద్దకు నిఱుపేదయట్లు వచ్చి మూఁడడుగుల నేల యాచి
అప్పుడు నేను,

ఉ. కైటభదైత్యమర్దనుఁడు గాని యితం డొక యర్థి గాఁడు మో
మోటముచేత నీవలదు మూఁడడుగుల్ధర యంచుఁ జెప్పుచున్
గాటపుటల్కఁ దర్భఁగొని నన్పొడిచెన్ గను లొట్టవోవఁగా
నాఁటికి నేఁటికిం దనయ నా కుడికన్నొటు లుండు జూడుమా ?

భగద—ఆచార్యా ! మీరు చెప్పినదంతయు సహేతుకముగా నున్నయ
అట్లయిన నా కిప్పుడు కర్తవ్య మేమి ?

శుక్ర—ఇదిగో నుపదేశించుచున్నాఁడ వినుము.

మ. అభిమానమ్మును జంపుకొమ్ము సమరవ్యాపారము న్మానుకొ
మ్మభయం బిమ్మని నందనందనుని పాదాంభోజము ల్వేఁడుకొ
మ్మభిషేకమ్మును జేసికొ మ్మవనికిన్ న్యాయంబుగా నేలుకొ
మ్ము భువిం బిమ్మటఁ జూచుకొమ్ము సిరియొప్పన్నిక నె ట్లబ్బునో.

శంబ—ఇదియే కర్తవ్యము.

క. అమరుల కాంగిరసుం డెటు
లమరారాతులకు శుక్రుఁ డట్టులె కానన్
సమయోచితంబు లగునీ
విమలోక్తుల నవధరించి వినుము కుమారా.

భగద—భగవానుఁడా ! ఓభార్గవా ! నీయుపదేశము మా కాదేశము గదా !
నట్లే చేయుదును. కాని పితృమరణమునకుఁ బ్రతిక్రియఁ జేయుట యెప్పుడు?

శుక్ర—సమయ మగునప్పుడు.

తే. గీ. మానసంబున రవులుక్రోధానలంబుఁ
గానఁబడకుండ దిగమ్రింగి కార్యవాది

సమయ మగునప్పు డల రేఁగి జగము లడలఁ
జేటుఁ బడఁదగు నగ్ని స్ఫులింగము నోల. 20

భగద—ఆచార్యా! మేలు. మీమాట శిరసావహించితి. శంబరా! నీవు పోయి పని యుక్తక్రియలవిషయమునఁ బ్రయత్నము సేయుము. నేనిప్పుడే కృష్ణునిఁ జూచి వచ్చెదను.

శంబ—చిత్తము. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

[అప్పుడు శ్రీకృష్ణుఁడు సత్యభామయుఁ బ్రవేశించుచున్నారు.]

కృష్ణ—దేవీ! చిన్ననాఁడు నేను సాందీపునియొద్ద విద్యఁ గఱచునెడ నొక ప్రబద్ధముఁ జదివితి. దానియాథార్థ్య మిప్పుడెఱింగితిని.

సత్య—అది యేదో యెఱింగించి నాకు వీనులవిందు సేయుదురా ?

కృష్ణ—సందేహ మేమి, ఇదిగో విను.

క. ఘనుఁడైన నల్పుఁడైనను
జననింద్యుం డైన లోకసమ్మతుఁ డైనన్
ధనియైనఁ బేద యైనను
దనతండ్రియె మంచివాఁడు తనయున కెపుడున్.

సత్య—దానియాథార్థ్య మెట్లెఱింగితిరి?

కృష్ణ—నరకుఁడు తనకుఁ దగుతండ్రి కాకున్న భగదత్తుఁడు మిక్కిలి విలపించుటచే నీసత్య మెఱింగితి. ఇప్పుడు పితృశోకవిహ్వలుఁ డగుభగదత్తుని సమాశ్వాసింపవలయును.

సత్య—దేవా! తండ్రిని జంపి కొడుకు నెట్లూఱడింపఁ గలరు. మీకు మోహము లేదా?

కృష్ణ—సుందరీ! రాజనీతి మోమోటము నెఱుంగదు. తొల్లి రాఘవుఁడు వా గడతేర్చి యంగదుని యౌవరాజ్యమున కభిషిక్తునిఁ జేసి వానికి సేవ్యుండు గాలేడే. యటుండనిచ్చి యిటువినుము.

మ. ఖలునిన్ మాగధుఁ ద్రుంచి తత్తనయునిం గద్దెం బ్రతిష్ఠించితిన్
దులువం గంసునిఁ జంపి నిల్పితిని బంధుల్ మెచ్చ మాతామహున్
బలుగాకన్ నరకున్ వధించితిని గానం బ్రోతుఁ దత్పుత్రునిన్
గలిగెంబోఁడిగొ రాచపాడి యిది క్రొత్తల్లావు మాకీపనుల్. 22

అదిగో శుక్రాచార్యసహితుఁడై భగదత్తుఁ డిచ్చట నున్నాఁడు.

సత్య—పేరు వినుటయే గాని భార్గవుల నెన్నఁడును దర్శింపలేదు.

కృష్ణ—దేవీ! ఇతఁ డసురగురుఁడైనను మహామహిమగలవాఁడు. వందనీయుఁడు.

(ఇద్దఱు నడచుచున్నారు.)

శుక్ర—కుమారా! దేవీసమేతుండై వాసుదేవుఁ డిటు వచ్చుచున్నాఁడు; నాదము చేసి శరణ మడుగుము.

భగద—చిత్తము. ఇందు, వారి నెదుర్కొందము.

శుక్ర—జయతు జయతు దేవకీనందన.

కృష్ణు—భార్గవుల కభివాదము సేయుచున్నవాఁడ.

శుక్రు—అనంతకల్యాణమస్తు. యదుకుంజరా! నీకతమున పితృవిహీనుఁ డీబాలకుఁడు నీకు రక్షణీయుఁడు. వత్సా! భగదత్తా! ఇదె నిన్ననుగ్రహించుటకు వంతుఁడు వచ్చియున్నవాఁడు. శరణము వేఁడుము.

కృష్ణు—అపరాధి వధింపఁబడియె. ఇతఁడు మా కవశ్యము రక్షణీయుఁడు.

భగద—(చేతులు జోడించి) దేవా! నందనందనా!

సీ. తమ్మిమాలిని గన్నతండ్రివయ్యు యశోదయొడిలోన బిడ్డఁడై యున్నవాఁడ
తెలిదివిపై బాళిఁదెగడి వ్రేపల్లెలో మందగాపరి వౌచు మన్నవాఁడ
వేవెలందులయిండ్లు వేమారు కొల్లాడి వెన్న మీఁగడఁ జాల తిన్నవాఁడ
తలఁపుల నెక్కొంచి వలపుల సుడిక్కొంచి గొల్లకన్నెలసిగ్గుఁ గొన్నవాఁడ
కమ్మవిలుకాని గడుపారఁ గన్నవాఁడ
వేఁడువారి నేలుదు వంచు విన్నవాఁడ
నన్నుఁ బ్రోవుము నీవాఁడనన్నవాఁడ
చిన్నవాఁడనో నందుని చిన్నవాఁడ. (అని కాళ్ళపైఁబడుచున్నాఁడు.)

కృష్ణు—కుమారా! లేలెమ్ము. (అని లేవనెత్తి)

మ. అలుకం బూనకుమయ్య నాపయిని నీయాత్మన్ రవంతేనియున్
వలపుం జొల్పకుమయ్య నేఁ బగతుఁడం గానయ్య నీ కియ్యెడన్
ఖలుఁడై నీజనకుండు ముజ్జగములం గారించుటం జంపఁగా
వలసె న్వానిని సేయఁగావలసె దుష్ప్రారంభముల్ నీయెడన్.

భగద—దేవా! ఇందు నీ తప్పేమున్నది! నీకుం బగతుండై మాతండ్రి స్వయముగా నింత తెచ్చుకొనియె.

కృష్ణు—ఓయీ! వెఱ్ఱివాఁడా! సాకుఁగాదు. లోకమునకుఁ బగతుండైయును

శా. నాకుం జుట్టమనంగ రాయమున నున్నాఁడే ప్రపంచంబునన్
లోకద్రోహులు మాకు సౌహృలు జుమీ లోకప్రియుల్ మా ప్రియుల్
శ్రీకృష్ణుం డవతారమెత్తెను జగత్క్షేమంకరోత్సాహియై
మీకు న్మిత్రుడు గీడు సేయుటకు జన్మింపంగలే దిద్ధరన్.

శుక్రు—దేవా! నీకుం జుట్టమును బగతురు లేనిమాట నిజమే. కాని నరకుని మాకుఁ జుట్టమును బగతుఁడుఁ గూడ నరయ్యు.

సత్య—భార్గవులు లెస్సగా సెలవిచ్చినారు. ఈమహాత్మునకు నరకుఁడు భూమిలన గొడుకగుటచేఁ బుట్టెను. ధర్మద్వేషి యగుటచే వైరి.

కృష్ణ—అది నిజమే. కుమారుఁ డయినను దుష్టుఁ డగుటచే వాత్సల్యము త్రోసి వధించితిమి.

శుక్రు—ఎట్లయినను నరకుఁడు మీచేతే హతుఁడై ముక్తుఁడయ్యె.

భగద—నాతండ్రి హరిచేత ముక్తుఁ డయ్యెనని నాకిప్పుడు కొంతదుఃఖ ముపశమించెను.

కృష్ణ—వత్సా! భగదత్తా! నీవు లోకానుభవమున కపరిచితుఁడవు గాన నా భావింపవేని నే నించుక యుపదేశింపఁ దలఁచుచున్నాఁడను.

శుక్రు—ఇది వాని ననుగ్రహించుట.

భగద—ఇందు నే నన్యథా తలఁపవలసినదేమున్నది?

కృష్ణ—నరుఁ డెంత తేజశ్శాలి యైనను గుణహీనుఁ డయినచో నభ్యుదయమునుఁడు. దానికి నీతండ్రియే తార్కాణము.

శా. ఆతేజంబున కాబలంబునకుఁ దోడై నీతియే యుండెనా
నీతం డ్రింతటివాఁడు ముజ్జగముల న్నిక్కంబుగా లేఁడు నూ
నీతిభ్రష్టుఁడు గాన నిట్లు చెడెను న్నీతండ్రి నీవు న్సురా
రాతు లర్థ్యవయి పోకఁబోక గుణిపై సాంగ్రావతిమం బేలుమా. 26

శుక్రు—కుమారా! ఈయుపదేశము నీ కనుసరణీయ మయినది.

భగద—ఇది నేను శిరసావహించుచున్నాఁడను.

కృష్ణ—ఇంకను నీ కుపదేశింపఁదగినవి రెండు గలవు. మహానుభావు లగుతపోధనుల యెడ వినయవృత్తి నెఱపుము. పరకాంతలయందు మాతృభావము నిలుపుము. వీనిని ధర్మవిరుద్ధముగా వర్తించుట స్వనాశముం దెచ్చుకొనుటయె.

. ఋషికి నెగ్గొనరించి నృపాలుఁడై జనియించె నవనిలో సమవర్తియంత వాఁడు
మునుల చేఁ బల్లకి మోయించి యజగరంబై పడె నహుషునియంత వాఁడు
జడదారి కోకకీడు సలిపియే శాపోపహతుఁ డయ్యె నమరేంద్రునంత వాఁడు
బ్రహ్మర్షి యల్కకుఁ బాత్రుఁడై నాఁటట్టు లణుగంగె వింధ్యునియంత వాఁడు
కాంతకై చెడె రావణునంత వాఁడు
అతివకై చెడె మీతండ్రియంత వాఁడు
ఎవఁడు సుఖియించెఁ బరకాంత గవయఁగోరి
యెవఁడు వర్ధిల్లె ఋషులకు నెగ్గు చేసి. 27

దని న్నొకధర్మకార్యమునకు నియోగింపఁదలఁతు. అది యేదందువేని

తే. గీ. తల్లిదండ్రుల కెడబాపి తగవుమాలి
పదియునారువేలకన్నెలఁ బట్టి తెచ్చి
చెఱల బంధించె నీరాతండ్రి చెనఁటి యగుచు
విడిచిపుచ్చుము వారి వేవేగ నిపుడు.

శుకర్షి—అవును. నరకునిపాలింటి మృత్యుదేవతలో యన్నట్టు లాకన్యలు దుఃఖిహ్వలమతులయి యున్నవారు. తక్షణమ వారిని విడువుము.

భగద—ఇదిగో నిప్పుడే నేను పోయి వారిని విడిపించెదను.

(అని నిష్క్రమించుచున్నాఁడు.)

సత్య—దేవా ! అనాథ లగునారాజకన్యలను విపత్సముద్రమునుండి యుద్ధరిమీరు పుణ్యముఁ గట్టుకొనిరి. మీమేలు వా రెన్నఁడు మఱవ గని తలంచెద.

కృష్ణ—సుందరి ! నే ననాథలకు నాథుఁడను. అగతికలకు గతినిగద.

సత్య—అందుచేతనే దేవతలు మహర్షులు మిమ్మాశ్రయించిరి.

శుక్ర—(ఆశ్చర్యముతో) ఎవరో యంతరిక్షమును దిగి యిటు వచ్చుచున్నా

కృష్ణ—(చూచి) మహేంద్రసఖుఁ డగుచిత్రరథుఁ డనుగంధర్వుఁడు.

సత్య—కిరీవిజయమునుగూర్చి మిమ్ము బహూకరించుటకు మహేంద్రుఁ డతఁ బంపియుండును.

శుకర్షి—అదిగో బృహదశ్వమహాముని యిటు వచ్చుచున్నాఁడు.

సత్య—ఇతఁడు తన్నిమిత్తమునే యిటు వచ్చియుండును.

[అప్పుడు చిత్రరథుఁడు బృహదశ్వుఁడు ప్రవేశించుచున్నారు.]

చిత్ర & బృహ—విజయతాం విజయతాం యాదవకులేంద్రనందనః.

కృష్ణ—గంధర్వరాజునకు స్వాగతము. మహర్షి కభివాదనము.

శుక్ర—బృహదశ్వా ! బదరికాశ్రమవాసులకుఁ గుశలమా ? చిత్రరథా ! దికభ్యుదయమా !

చిత్ర & బృహ—ఇప్పు డభ్యుదయమే.

కృష్ణ—మీరాకచేత ధన్యుఁడ నయితిని.

చిత్ర—దేవా ! మహేంద్రుఁడు మీరొనర్చినయుపకారమునకుఁ గృతజ్ఞుఁ తనభక్తిని మీకు విన్నవింపు మని నన్నుం బనిచె. ఇవిగో నాతనిమాటలు వినుఁడు,

క. అనుజుఁడనై యొకమారు
దనుజభయం బుడిపి యొక్కఁడరిఁ జేర్చితి నా
మనుజుఁడవై యిప్పుడు దితి
తనుజుల మర్దించి నన్ను దయఁ జూచితివో.

కృష్ణ—ఎంతమాట. మహేంద్రునకు నేనా యుపకారము చేయఁగలవాఁడను. ఈజయమునకుఁ గారణము మహేంద్రప్రభావమే.

తే. గీ. అన్న సన్నద్ధుఁడై పోరకున్న నేమి
తమ్ముఁగుఱ్ఱమె గెల్చెగా దనుజతతిని
మాపుల నిసుండు లేఁడన్నమాటె గాని
చంద్రికాంతియు నతని తేజంబు కాదె ? 30

చిత్ర—ఇది కేవల వినయోక్తి.

బృహ—దేవా ! బదరికాశ్రమతాపసులు తమభక్తి విన్నవింపు మని నన్ను మీ కడకుఁ బుత్తెంచిరి.

మ. శ్రవణానందముగా వినంబడియె ఘోరమ్మన్య గర్వాంధు డై
త్యవిభు న్నీ విటఁ జంపినట్టిశుభవార్త ల్తాపసశ్రేణిచే
భువనంబు ల్పదునాలుగుం బడసె సంపూర్ణప్రమోదంబు నీ
భువి నీరాక్షస మయ్యె నీకరుణ నుత్ఫుల్లాంబుజాతేక్షణా ! 31

కృష్ణ—దివ్యులయు మహర్షులయు ననుగ్రహముచే నిప్పుడు విజయలక్ష్మీసమేతుఁడనయితిని.

బృహ—ఇప్పుడు గాదు. ఈవిజయలక్ష్మిని నీవు ద్వారకనుండియే వెంటఁదెచ్చితివి.

చిత్ర—అవునవును.

క. ఇత్తలిరుఁబోఁడిచేఁ గ్రొ
న్నెత్తురులను ద్రావునట్టి నీచదనుజులన్
మొత్తించుట మెత్తనిపువు
గుత్తులతో రాళ్ళు పగులఁగొట్టించుటఁజూ !

బృహ—దివ్యమనుష్యాంగనలలో నెవ్వరు నీమెకు సవతు రారు.

శుక్ర—లావణ్యముండుచోట పరాక్రమ ముండుట యరిది.

(అప్పుడు భగదత్తుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

భగ—దేవా ! మాతండ్రిచేత బంధింపఁబడినరాజకన్యకల విడిపించితిని. వారందఱు రమానాథుఁడు జగన్నాథుఁడే మాకు నాథుఁ డని మిముం బరిణయ మగుటకుఁ గోరుచున్నారు.

చిత్ర—ఇది మీరు నిరాకరింపఁదగినది గాదు.

బృహ—జగత్కల్యాణకరునకుఁ గల్యాణము లగుట వింతగాదు.

శుక్ర—ఆకన్య లనుగ్రహింపఁబడుదురు గాక !

కృష్ణు—ఇందు నేను మధ్యస్థుఁడను. సత్యభామయే దానిని నిర్ణయింపవలయును.

సత్య—భరియించువారు మీ రుండఁగ నేను నిర్ణయింపవలసిన దేమి?

కృష్ణు—సవతులతో వేఁగవలసినదానవు నీవు.

సత్య—ఇందఱుభార్యలతో మీరు వేఁగఁగా సవతులతో నే వేఁగఁజాలనా?

కృష్ణు—భగదత్తుఁడా! మహర్షి సమక్షమున నందఱ నేను బరిగ్రహించితి.

చిత్ర—దేవా! పోవుటకు మాకింక ననుజ్ఞ యిమ్ము.

మ. అవతారంబుల నెత్తి భూభరముఁ ద్రోయ మీనమై కూర్మమై
సువరాహం బయి నారసింహ మయి గుజ్జం బ్రోడయై మీఁద భా
ర్గవుఁడై రాఘవుఁడై యదు ప్రవరుఁడై కళ్యాణముఁ గూర్చి యా
దివిజానీకము గాచు వైష్ణవమహాతేజంబు మమ్మేలుతన్. 33

బృహ—దేవా! నిన్ను నేను గొనియాడఁజాలను; కాని,

సీ. ప్రామిన్కుటుపిదల శమంతమణి గాచు వలరారు నెవ్వాని యొడుగుదోయి
బ్రహ్మాండగృహమందు రత్నసంపుటిదివ్వెలై కడు వెల్గు నెవ్వానికన్నుఁగోయి
శ్రితజనంబుల కెల్లఁ జేయూఁతకోలలై క్రాలెడు నెవ్వాని కేలుదోయి
దుష్టనాశము దెల్పు ధూమకేతువు గాచు ముడివడు నెవ్వాని [illegible]మ్మదోయి
యట్టిజగదేకగురునకు నచ్యుతునకు
నాదిమధ్యాంతరహితున కవ్యయునకు
విశ్వమోహనునకు మహావీరునకును
జ్ఞానమయునకు నంజలి నేనొసర్తు. 34

కృష్ణు—దేవతలయు మహర్షులయు నీప్సితములు సిద్ధించుగాక!

బృహ—జగముల కిదివఱకే యనంతకళ్యాణములైనవి. వెండియు నిట్లగుఁగాక!

ఉ. నెలకును మూఁడువానలవనిం దగుఁ బంట లెచ్చ రా
జులు ప్రజలం బలెం బ్రజలఁ జూచుకొనం దగుఁ బ్రేమమీఱ నీ
వలెఁ దలిదండ్రు లింక దలవంపులఁ దెచ్చెడు పెద్దబిడ్డలన్
పిలుచన శిక్ష చేయఁదగుఁ బ్రేమముఁ ద్రోసి ప్రసన్నయాదవా! 35

కృష్ణు—తథాస్తు.

(అందఱు నిష్క్రమించుచున్నారు.



సమాప్తము.